# కర్మ సిద్ధాంతం

భీష్మ




ది విజయవాడ పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ
పిరమిడ్ హౌస్ - మాచవరం
విజయవాడ

# కర్మ సిద్ధాంతం

**భీష్మ**

ముద్రణాలయం :
సోమేశ్వర ప్రింటింగ్ ప్రెస్,
విజయవాడ - 520 002.
ఫోన్: 577684

కవర్ డిజైన్ :
D. శివప్రసాద్

వెల : 35/-

ప్రచురణ :
J. రాఘవరావు , ప్రసిడెంట్
ది విజయవాడ పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ
విజయవాడ. ✆ : 430334

ప్రతులకు:
**Om Art Print**
GOVERNORPET, VIJAYAWADA- 2
✆ : (O) 578333 (R) 470332

పిరమిడ్ ధ్యాన కేంద్రం
11/39-C సుబ్బప్ప కాంపౌండ్
గుంతకల్ - 515 801. ✆ : 27123

# ముందుమాట

" అన్నమయ్య " సినిమా దాదాపు అందరూ చూసే ఉంటారు!

ఆడుతూ, పాడుతూ అల్లరి చేస్తూ బాధ్యత లేకుండా తిరిగే అన్నమయ్య ఒకానొక శుభముహూర్తంలో " ఆలోచనా - రహిత - స్థితి " లోకి జారుకుని, " ఓ గ్రేట్ మాస్టర్ " అయిన వేంకటేశ్వరుని దివ్యదర్శనం (అంటే ఒకానొక "థర్డ్ ఐ విజన్ " ఎక్స్‌పీరియన్స్ వచ్చిందన్నమాట!) చేసుకున్నాడు అంతే - !!! ఆ తరువాత తననెల్లా అర్పించుకుని తన జీవితాన్ని ఆధ్యాత్మిక ప్రచారానికి అంకితం చేశాడు.

ఇంతవరకూ ఈ అన్నమయ్య కథంతా దాదాపు అందరూ ఎరిగినదే!

మరి, అదే " ఆలోచనా - రహిత - స్థితి " ని " ధ్యానం " ద్వారా పొంది కేవలం దర్శనమే కాక వేదాంత సారమైన " కర్మ సిద్ధాంతాన్ని " అలనాటి గ్రాండ్ మాస్టరయిన " భీష్మాచార్యుని " ద్వారా పొందిన మహారాష్ట్ర, " సాంగ్లీ పిరమిడ్ స్పిరిచ్యువల్

సొసైటీ " మాస్టర్ అయిన దేశ్ బంధు (జూనియర్ ఇంజనీర్, C. W. C., సాంగ్లీ) గారెంత ధన్యులో వివరింపగలమా - !?!

ఆటోమాటిక్ రైటింగ్ ద్వారా 1998 వ సం॥లో ఆంగ్లంలో దేశ్‌బంధు గారిచే గ్రహించబడిన ఈ అరుదైన సందేశాన్ని తేటతెలుగులోకి అనువాదం చేసిన వారు ఆ సంస్థ యొక్క ప్రధాన వ్యవస్థాపకులు శ్రీ సాయి సుదర్శనం గారు.

ఇంత చరిత్ర గలిగిన ఈ " కర్మ సిద్ధాంతం " ప్రచురణ కనుగుణంగా, పిరమిడ్ ధ్యాన కేంద్రాల వ్యవస్థాపకులైన బ్రహ్మశ్రీ సుభాష్ పత్రి గారిచే ముస్తాబయి, ఈనాటి జిజ్ఞాసువులందరూ అనుదినమూ ఆచరింపదగిన జీవనవిధానాన్ని అతి సరళంగా వివరించిన ఈ అపురూప సందేశ రాజాన్ని " ది విజయవాడ స్పిరిచ్యువల్ సొసైటీ " ద్వారా ప్రచురించగలిగినందుకు మరియు ప్రచురణకు సహకరించిన వారందరికీ కృతజ్ఞతాభి వందనములతో.....

J. రాఘవరావు, ప్రెసిడెంట్
ది విజయవాడ పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ
పిరమిడ్ హౌస్, మాచవరం,
విజయవాడ. ✆ : 430334

# " కర్మ సిద్ధాంతం "

సిద్ధుల యొక్క అంత్య అవగాహనే 'సిద్ధాంతం'!
నిరంతర సాధన యొక్క అంత్యస్థితే సిద్ధత్వం!

సృష్టిలో వున్నది కేవలం ఒక్కగానొక్క సిద్ధాంతం!
ఆ ఒక్కగానొక్క సిద్ధాంతమే 'కర్మ సిద్ధాంతం'!

చేసుకున్నవాడికి చేసుకున్నంత మహదేవా !
చేసుకోనివాడికి చేసుకోనంత మహదేవా !!

యద్భావం తద్భవతి మహదేవా !
యద్భవతి తద్భావం మహదేవా !

మన భావనలే మన యధార్థాలవుతాయి !
మన యధార్థాలనుంచే మళ్ళీ మన భావనలుదయిస్తాయి !

ఈ సనాతన సిద్ధాంతం గురించి
ఇప్పుడు సనూతన వివరణ, అధునాతన విశ్లేషణ !

అందులోనూ భీష్ముల వారి వద్ద నుంచి !!
పిరమిడ్ ప్రపంచంలోనుంచి ఓ అద్భుత కానుక !

కర్మ సిద్ధాంత అవగాహన నుంచి ఉద్భవించేదే 'కర్మయోగం'!
అందుకే జత 'కర్మయోగం' గురించి శ్రీ వివేకానందుల వారి అద్భుత సందేశం!

పిరమిడ్ యోగులందరూ అయ్యారు కర్మ శాస్త్ర వేత్తలు!
ఇక పిరమిడ్ వీరులందరూ అవ్వాలి కర్మయోగ పరాయణులు!

- సుభాష్‌పత్రి

# " కర్మ సిద్ధాంతం "

ప్రప్రథమం గా, ఆత్మలకి " మనమంతా పరమాత్మలో ఒక భాగమే" నని తెలుసు! వాటికి కోరికలు లేవు! అందువల్ల వాటికి శక్తి సామర్థ్యాలు చెదిరిపోకుండా ఉండి విస్తారంగా చూసే శక్తి, తలచిన వెంటనే ఏ ప్రదేశానికైనా ప్రయాణించే శక్తి, ప్రత్యేకంగా ఏ ఒక్క లోకానికే పరిమితం కాకుండా వుండే శక్తి వుండేవి. వాటికి అన్ని లోకాల్లో, అన్ని ఫ్రీక్వెన్సీలలో ప్రవేశం ఉండేది.

ఈ సమయంలో సృష్టికర్త కొంత అనుభవాన్ని పొందాలన్న కోరికతో తాను సృష్టించిన ఆత్మలకి మనస్సు ద్వారా ఆలోచన చేసే శక్తినిచ్చి వారిని వివిధ లోకాలకు పంపాడు.

ఆత్మలన్నీ రెండు కోవలకి చెందేలా విభజింపబడ్డాయి. మొదటి వర్గం " వివేక క్షేత్ర ఆత్మలు (Intellectual Zone Spirits) ", రెండవ వర్గం " స్వచ్ఛంద ఆలోచన క్షేత్ర ఆత్మలు (Free-Will Zone Spirits) ".

" వివేక క్షేత్రం " లోని ఆత్మలు శాస్త్రీయపరం గా ఎంతో ప్రగతి చెందినవి. శాస్త్రీయం గా అభివృద్ధి చెందటం వలన వారు సృష్టికర్తతో సమానమని తలవటం ప్రారంభించారు!

వాటి శక్తులు అమోఘమైనవి! తమ శక్తితో యితర క్షేత్ర ఆత్మలను వారి ఆధీనంలోకి తీసుకొనగలవు. కొంత అనుభవాన్ని సంపాదించటం కోసం, వారిపై తమ అభిప్రాయాలతో వొత్తిడి కలిగించేవి. ప్రకృతి సిద్ధాంతం

ఏమంటుందంటే " ఆత్మ తన కర్మ ఋణాన్ని తగిన చర్యల ద్వారా తానే తీర్చుకోనంత వరకు కర్మ నుండి విముక్తిని పొందలేదు ".

అందువల్ల ఈ క్షేత్రంలోని ఆత్మల ప్రగతి చాలా నిదానంగా ఉండేది. ఆధ్యాత్మిక ప్రగతి యొక్క వేగం తక్కువగా ఉన్నప్పటికీ శాస్త్రీయ పరంగా అవి ఎంతో అభివృద్ధి చెందినవి. వారిలో కొందరు ప్రవక్తలుగా తయారై, మిగతా వారికి మార్గదర్శం చేస్తూ, వారి అంతిమ ధ్యేయ సాధనలో సహాయ పడేవారు. వివేక క్షేత్ర ఆత్మల గురించి యింకా చాలా చెప్పుకోవచ్చు. దానికింకా సమయం వుంది.

ప్రస్తుతం " స్వచ్ఛంద ఆలోచనా క్షేత్ర ఆత్మల " మీద మన చర్చను కేంద్రీకరిద్దాం. మనకు ఎక్కువగా ఈ క్షేత్రంతోనే సంబంధం వుంది. కనుక " స్వచ్ఛంద ఆలోచనా క్షేత్ర " మంటే ఏమిటో వివరంగా తెలుసుకుందాం.

భూలోకం ఈ క్షేత్రం పరిధిలోకే వస్తుంది. మనం తెలుసుకోవలసిన దేమంటే మన భూలోకమే కాకుండా, మరెన్నో లోకాలు కూడా ఈ క్షేత్ర పరిధిలోకి వస్తాయి. సూక్ష్మ లోకాలు, కొన్ని మానసిక లోకాలు కూడా ఈ క్షేత్రంలో వున్నాయి. మరి ఇతర లోకాలకు ప్రస్తుతం ప్రాముఖ్యత ఇవ్వనవసరం లేదు.

" కర్మ చక్రం ఎలా ఆరంభమైంది? ", " మన మందరం కర్మ చక్రంలో ఎందుకు బందీలుగా వున్నాం? ", " దాని సిద్ధాంతం ఏమిటి? ", " కర్మ ఋణాన్ని ఏ విధంగా తీర్చుకోవచ్చు? ", " ఈ చక్రం నుండి బయట

పడటం ఎలా? " - మొదలైన ప్రశ్నలన్నీ చాలా ముఖ్యమైనవి. ప్రతి ఒక్కరూ వాటి గురించి లోతుగా తెలుసుకోవలసిందే. అందువల్ల ఒకదాని తర్వాత ఒకటి వివరంగా తెలుసుకుందాం.

' కర్మ చక్రం ' ఎలా ప్రారంభమైందన్న విషయాన్ని తెలుసుకునే ముందు దీని పట్ల జన బాహుళ్యంలో వున్న ' అవగాహనలు ' ఏవిధంగా వున్నాయో పరిశీలిద్దాం. హిందూమత సిద్ధాంతం ప్రకారం - " ఒకరు తమ కర్మ చక్రాన్ని పూర్తిగా అనుభవించనంత వరకూ వారికి జ్ఞానోదయం కలుగదు. ఆనందం అనుభవంలోకి రాదు. కర్మ ఋణాన్ని పూర్తిగా తీర్చుకోనంత వరకూ కష్టాలు వీడవు. ఎవరైతే కర్మ సంకెళ్ళ నుండి విముక్తి పొందుతారో వారి కోసం దేవలోకం ఎదురు చూస్తూంటుంది "

బౌద్ధమతం ప్రకారం " ఒక వ్యక్తి తన కర్మల మూలంగా ఉత్పన్నమైనటువంటి వ్యతిరేకతా భావాల్నీ, కోరికలనూ వీడనంత వరకూ, అతను నిర్వాణాన్ని పొందలేడు. ఎవ్వరూ కూడా మనల్ని కర్మ సంకెళ్ళ నుండి బయటకు విడిపించలేరు. మన స్వప్రయత్నం తోనే మనమే బయటకు రావాలి ".

ఇస్లాం మతం ప్రకారం " సక్రమమైన బాటలో నడిచారంటే స్వర్గానికి వెళ్ళ గలరు; అన్యధా నరకం మనకోసం ఎదురు చూస్తూంటుంది ".

క్రైస్తవ మతం ప్రకారం - " దేవుని ఎదురుగా మన తప్పులన్నింటినీ ఒప్పుకుని ఆయన పట్ల విశ్వాసాన్ని ఉంచినట్లయితే మనకి స్వర్గం లభిస్తుంది; అన్యధా మనం నరకాన్ని అనుభవించాలి ".

వాస్తవం గా చేప్పాలంటే మొదటి రెండు మతాలూ కర్మ సిద్ధాంతాన్ని ఖచ్చితమైన నిజాల్ని వివరంగా తెలిపాయి.

కృష్ణుడి యొక్క జీవితాన్ని ఉదాహరణగా తీసుకున్నట్లయితే అతను ఎంతో మంది గోపికలనూ, శిష్యులనూ తన ప్రేమతో బంధించాడు. మహాభారత యుద్ధ ప్రారంభదశలో అర్జునుడు తన బంధువుల పట్ల ప్రేమ భావంతో మునిగి వున్నప్పుడు, శ్రీకృష్ణుడు అతనికి జ్ఞాన బోధ చేసి వెలుగుబాటలో నడిపించి తన కర్మను నిర్వర్తించేలా చేసాడు.

కృష్ణుడు ఒక గొప్ప జ్ఞాని!

అతను తలుచుకుంటే యుద్ధాన్ని తేలికగా ఆపగలడు. కానీ ఆయనెప్పుడూ ఇతరుల కర్మల జోలికి వెళ్ళలేదు. వారిలో వున్న స్వయంగా నిర్ణయించే శక్తికి అంతరాయం కలిగించలేదు. ఆయన ప్రేమకూ, వెలుగుకీ ఒక గొప్ప ప్రతీక!

బుద్ధుడి విషయంలో కూడా అంతే!

ఆయన ఏమని బోధించాడంటే ఎవ్వరైనా తమ దుఃఖాల నుండి తాము బయటపడాలనుకుంటే తప్ప వాటిని వేరెవ్వరూ దూరం చెయ్యలేరు. అందువల్ల, అతను ప్రజలకు ధ్యానాన్ని నేర్పించాడు. తామెవరో తెలుసుకునేటంత వరకూ, ఎవ్వరూ కూడా తమ కష్టాల నుండి స్వాతంత్ర్యాన్ని పొందలేరు.

ఆయనకి ప్రేమ లేదంటారా? కాదు; ఆయన హృదయంలో ఎంతో ప్రేమ దాగి వుంది! ' ప్రేమ ', ' దయ ' అనే గుణాలు అతని

కోటగోడల్లాంటివి. మహిమలను చూపటం వలన ప్రజలు తప్పుడు మార్గంలోకి వెళ్తారని ఆయన వాటిని ఎన్నడూ చూపలేదు. వారికి శాశ్వతమైన పరిష్కారాన్నిచ్చి సహాయ పడాలన్న ఉద్దేశ్యంతో ' ధ్యాన మార్గా ' న్ని బోధించాడు. ఆయన సంపూర్ణ జ్ఞానాన్నీ, దివ్యదృష్టినీ కలిగి వున్న ఒక అద్భుత కోవకు చెందిన మాస్టర్!

" కర్మచక్రం ఎలా ప్రారంభమైంది? " అన్న ప్రశ్నకు తిరిగి వద్దాం. ప్రారంభం లో స్వచ్ఛందం గా ఆలోచించ గల్గిన క్షేత్రం **(Free-Will Zone)** లో ప్రేమ, సోదరభావం నిండి ఉండేది. ప్రతి ఒక్క ఆత్మ కూడా శాంతి సౌఖ్యాలతో నిండి ఉండేది. మెల్ల మెల్లగా, ఆ క్షేత్రంతోటి బాగా పరిచయం ఏర్పడిన తరువాత, కొన్ని ఆత్మలు భౌతిక వస్తువుల కోసం ఆరాట పడటం ప్రారంభించాయి. కొన్ని ఆత్మల పై సుఖం, వాంఛల ప్రభావం పడి వాటిని ' స్వంతం చేసుకోవాల ' న్న భావం వారిలో ఉత్పన్నమైంది. ఈ ఆత్మలు, వాటి కార్యకలాపాల వల్ల, తమ దైవత్వ గుణాలకి మెల్ల మెల్లగా దూరం కాసాగాయి. కూడబెట్టిన ఆస్తుల మూలం గా విలాసవంతమైన జీవనానికి అలవాటు పడ్డాయి. వారు జీవించే శైలినీ, విలాసవంతమైన జీవిత విధానాన్నీ చూసి, యితర బలహీన ఆత్మలు వారి మార్గాన్నే అనుసరించాయి. యిప్పుడు వారిలో ' పోటీలు ' ఏర్పడ్డాయి. మొదట్లో ఈ పోటీలు సమంజసం గా వున్నా రాను రాను మోసం, కొట్లాటల్లోకి దిగనారంభించాయి!

యిటువంటి సమయం లో సృష్టికర్త ఒక సిద్ధాంతాన్ని తయారు చేసాడు. ఎవరైతే ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తిస్తారో వారందరూ ఈ క్రొత్త సిద్ధాంతానికి అంటే 'కర్మ సిద్ధాంతా'నికి బద్ధులై ఉండవలసిందే!

ఈ కర్మ చక్రానికి సమగ్రమైన ఆకారాన్ని రూపుదిద్దటానికి " అంతరిక్ష విజ్ఞాన కోశాలు (Akashik Records)" ప్రారంభమయ్యాయి. ఈ సందర్భంలో మీరు వివరంగా తెలుసుకోవలసిన దేమంటే, ఎప్పుడైతే ఆత్మలు తమ దేవతా ప్రకృతిని మరచాయో అప్పుడే ఆకాశిక్ రికార్డులు ప్రారంభమయ్యాయి.

ఎవరైతే తమ కర్మ రుణాన్ని తీర్చుకోవటానికి సంసిద్ధత చూపుతారో వారికి ఈ ఆకాశిక్ రికార్డులు అందుబాటులో ఉంచబడతాయి.

మరొక్క విషయం స్పష్టంగా తెలుసుకోవలసినదేమంటే ఈ భూలోకం వీడిన ఆత్మలు అధిక ప్రమాణంలో దాని పై లోకమైన " వాంఛా లోకం (మొదటి సూక్ష్మ లోకం) " లోకి ప్రవేశిస్తాయి. ఈ లోకం లో ఎవరికైతే జ్ఞానం తక్కువ ప్రమాణంలో వుండి కోరికలు ఎక్కువ ప్రమాణంలో ఉంటాయెా వారు తమ నగటు కోర్కెలను తీర్చుకోవటంలోనే సమయాన్నంతా గడుపుతారు. ఈ లోకానికి చేరిన ఆత్మలకు కూడా బోధనలూ, మార్గదర్శకత్వమూ అవసరమే. కానీ వారిలో ఎక్కువ మంది మొదట్లో ఈ జ్ఞాన బోధనలను లెక్క చెయ్యరు. అయితే వాటి కోర్కెలన్నీ ఎప్పటికప్పుడు కష్టపడకుండానే తక్షణమే తీరిపోవటం వలన, ఈ ఆత్మలు విసుగు చెంది, క్రమక్రమం గా బోధనలవైపు వారి దృష్టిని మరలిస్తారు.

కానీ, ఈ లోకంలోని ఆత్మలు ఎక్కువ ప్రమాణంలో ఆధ్యాత్మిక ప్రగతి పొందనందువలన, ఆకాశిక్ రికార్డుల గురించి తెలిసిన వెంటనే తొందరపడి తమ చరిత్రలను పరిశీలించుకుంటాయి. వారి అజ్ఞానం

కారణంగా ఈ ఆత్మలు తమ కర్మ రుణాన్ని ఎలా తీర్చుకోవాలో, క్రొత్త కర్మను కూడపెట్టుకోకుండా ఎలా చేసుకోవాలో తెలుసుకొనక ముందే, తొందరపాటుతో భూలోకంలో తిరిగి జన్మిస్తాయి! ఈ విధంగా తొందరపడి నిర్ణయం తీసుకోవటం వలన ఎక్కువ జన్మలలో, కర్మ రుణాన్ని తీర్చుకోవటానికి తమ ఆత్మలకు సహాయపడకపోగా మరింత కర్మ రుణాన్ని కూడ బెట్టుకుంటారు.

' కర్మ ' అంటే ఏమిటో వివరం గా తెలుసుకుందాం.

కోరిక, లేదా ఇంద్రియాలకు సంబంధించిన ఒక ఆలోచన, లేదా చర్య ద్వారా ఒక వ్యక్తి తన జీవిత చక్రంలో కొంత ' జమ ' లేదా ' రుణా ' న్ని కలిగించటం వలన, దాన్ని ఈ జన్మలో లేదా మరుజన్మలో తీర్చుకోవలసి వుంటుంది. ' జమ ', ' రుణం ' అనేవి వాటి తీవ్రతపై ఆధారపడి మారుతూంటాయి.

మన జీవితాలను ' శూన్యం ' తో, లేదా ' కర్మ రాహిత్యం ' తో, మొదలు పెట్టాం. అందువల్ల ఎప్పటి వరకైతే మన కర్మ విలువ మళ్ళీ శూన్యానికి చేరదో అప్పటి వరకూ జ్ఞానోదయమవ్వదు! కర్మ విలువ తరిగిపోతున్న కొద్దీ ఆ వ్యక్తికి ప్రకృతి మూల సిద్ధాంతాల అవగాహన ఎక్కువగా ఉంటుంది! ఈ విధంగా అతనిలో అవగాహన పెరిగి ప్రవహిస్తున్నప్పుడు, అతను పరమాత్మను చూడటానికి సరైన జ్ఞానం, విజ్ఞానం కలిగి ఉండాలి. అన్యధా తన ధ్యేయాన్ని వీడి తప్పుడు మార్గంలో నడవటానికి అవకాశం ఉంది. కనుక, కర్మనధిగమించే విషయంలో జ్ఞాన విజ్ఞానాల పాత్ర ఎక్కువగా వుంటుంది.

' కర్మ ' మీద మన చర్చను కేంద్రీకరించినట్లయితే, దానిని రెండు విధాలుగా విభజించవచ్చు. మొదటిది ' నిత్య కర్మ '; రెండవది ' సత్య కర్మ '.

' నిత్యకర్మ ' ను తిరిగి రెండు విభాగాలు గా చర్చించవచ్చు. మొదటిది ' చెడు కర్మ ', రెండవది ' మంచి కర్మ '.

## " చెడు కర్మ " :

**ఒకరి ఆలోచనల ద్వారా లేదా చర్యల ద్వారా యితరుల ఆత్మ ప్రగతికీ, పరిణామానికీ, దైనందిక జీవనానికీ యిబ్బందినీ, హానినీ కల్గించి వారి స్వేచ్ఛకు అడ్డుపడినట్లయితే దానిని ' చెడుకర్మ ' గా చెప్పవచ్చు.**

ఇక్కడ ' ఆలోచన ', ' చర్య ' అనేవి రెండూ సమాన ప్రాముఖ్యత కలిగినవే. ఆలోచన, చర్య రెండూ కూడా ఒకే కర్మ ఫలితాన్నిస్తాయి. **వాస్తవం గా చెప్పాలంటే నిరంతరం గా ఉండే ఒక చెడు ఆలోచన, కొన్ని చెడ్డ పనుల కంటే ఎక్కువ ప్రమాణంలో కర్మను కూడబెడుతుంది.** ఒక చెడు చర్య, ఎక్కువ సందర్భాలలో కొద్ది క్షణాల పాటు ఆవేశం కట్టలు తెంచుకోవటం కారణంగా చేసిన చర్య అవ్వటం వలన, అతను తను చెడు చర్యకు చాలా సందర్భాలలో పశ్చాత్తాప పడి " ఆ విధంగా ప్రవర్తించకుండా ఉండవలసింది " అని బాధపడి " భవిష్యత్తులో జాగ్రత్త వహించాలి " అని ప్రయత్నిస్తాడు. కానీ, ఒక చెడు ఆలోచన మన మనస్సులోకి చొచ్చుకు పోవటాన్ని మనం లెక్క చెయ్యం - ఎందువల్లనంటే, అది బాహ్యంగా ఏ ' చర్య రూపం ' లోనూ కనిపించదు.

వాస్తవానికి ఒక వ్యక్తి చెడుగా ఆలోచించినట్లయితే వెనువెంటనే అతనే చెడు చర్య జరుపకపోయినప్పటికీ అదే మాదిరి సందర్భాలలో ఉన్నటువంటి వేరొక వ్యక్తి చేసే చెడు ఆలోచనకు శక్తినిచ్చి అతనితో చెడు చర్య చేయించటానికి కారణమవుతుంది! కనుక, ఒక వ్యక్తి తన చెడు కర్మ నుంచి విముక్తిని పొందాలంటే తన చర్యల మీదే కాకుండా, ఆలోచనా విధానాలపైన కూడా నిఘా ఉంచాలి.

## " మంచి కర్మ " :

'మంచి చేయటం ' వలన కర్మనెలా సంక్రమించుకుంటాం?

అవును! మంచి చర్యల వల్ల కూడా కర్మ ఏర్పడుతుంది. ఒక ఉద్దేశ్యంతో మంచి పనిని చేసినా లేదా ఆ పని చేయటం మంచిదని తెలిసి దాని వలన మనకు ప్రతిఫలం ఉంటుందని ఆశించటం వలన, తప్పకుండా ఆ చర్య ' కర్మ ' ను కూడబెడుతుంది. మంచి కర్మ ఈ జన్మలో తరువాత జన్మలో కూడా ఉపయోగపడుతుంది. కానీ, కర్మ కర్మే కదా! మంచిదైనా, చెడుదైనా మనల్ని మరొక్కసారి జీవిత చక్రంలోకి తీసుకుని రావటం వలన ప్రతి జన్మలోనూ క్రొత్త కర్మని కూడబెట్టటానికి అవకాశం వుంది. కర్మచక్రాన్ని అధిగమించాలంటే ప్రతి ఒక్కరూ మంచి చెడులకి అతీతమై ఉండాలి.

' మంచి కర్మ ' ని ఎలా అధిగమించాలి?

యితరులకు మీరు చేసినటువంటి ఒక మంచి చర్య వలన వారికి [illegible]లు కలిగినట్లైతే, " అది ఒక మంచి చర్య " అని గ్రహించి,

" ఈ విధంగా మంచి పనులు చేయటం నా సహజ స్వభావం " అని తలవాలి. " మంచి చేయటం, మంచి అనుభూతులను కలిగి వుండటం ప్రతి జీవి యొక్క స్వాభావిక గుణం; అందువల్ల దానికి నేను గర్వించకూడదు. దాని నుంచి ఏమీ ఆశించకూడదు " అన్న భావం మనలో ఉండాలి.

ఈ విధంగా ఆలోచించటం ప్రారంభించినట్లయితే మీరు క్రొత్త కర్మలని కూడబెట్టలేరు. అన్యథా, మీరు చేసిన మంచి పనులు ప్రతిఫలరూపంలో ఐశ్వర్యాన్నీ, హోదానీ, పేరు ప్రతిష్టలనూ కలిగించటం వల్ల మీరు వాటిని క్రొత్త కర్మను కూడబెట్టుకోకుండా సక్రమంగా నిర్వర్తించలేకపోతారు.

ప్రతి మంచి చర్య వలన, ఎల్లవేళలా ఐశ్వర్యం, హోదా, పేరు ప్రతిష్టలను సంపాదించినప్పటికీ " వీటన్నింటినీ విశ్వసౌఖ్యం కోసం, ఆత్మోన్నతి కోసం ఉపయోగించవచ్చు " అన్న బలమైన జ్ఞానం కలిగి క్రొత్త కర్మని కూడబెట్టకుండా మీ జీవితాన్ని సుఖశాంతులతో కొనసాగించటం వలన ఆత్మసాక్షాత్కారం కోసం మీరు చేస్తున్న ప్రయాణం దగ్గరవుతుంది.

## " సత్య కర్మ " :

ఈ కర్మను ఆత్మ యొక్క ' అంతిమ కర్మ ' గా చెప్పవచ్చు. ఎప్పుడైతే చెడు కర్మలకంటే మంచి కర్మల యొక్క నిల్వ ఎక్కువ అవుతుందో అప్పుడే ఒక ఆత్మకు సత్యకర్మ ప్రారంభమవుతుంది.

వాస్తవానికి మంచి కర్మల నిల్వ ఎంత ఎక్కువగా ఉంటే, సత్య కర్మ యొక్క తీవ్రత అంతే ఎక్కువగా ఉంటుంది.

సత్యకర్మ లోకి ప్రవేశించిన తరువాత పొందగలిగే లాభం ఏమిటంటే, ఇంక ఆ ఆత్మ ఇక తన స్థితిగతుల్నీ, తన గమ్యాన్నీ, తన శక్తినీ, తన ఉనికి యొక్క ఉద్దేశ్యాన్నీ తెలుసుకోగలదు. అందువలన అది తన పరీక్ష కోసం తగిన స్థలాన్నీ తగిన కాలాన్నీ, తగిన వాతావరణాన్నీ శ్రద్ధగా పరిశీలించి సరిగ్గా ఎన్నుకుని జన్మ తీసుకుంటుంది.

సత్య కర్మను చేరుకున్న ఆత్మ కూడా పరీక్ష కోసం జన్మ తీసుకున్న జీవితపు మొదటి దశలో తన శక్తిని తెలుసుకోలేదు! అయితే " ఎక్కువ పరిమాణంలో కూడబెట్టిన మంచి కర్మ " ఆ ఆత్మ యొక్క బాటను వీడిపోకుండా ఉండేలా చేస్తుంది. ఆ జీవి పెరగటం ప్రారంభించే కొద్దీ " తాను ఈ లోకానికి సంబంధించని వాడు "గా భావించటం జరుగుతుంది. తానెవరో తెలుసుకోవాలన్న తపనతో ఒక చోటు నుండి మరొక చోటుకు తిరుగుతూంటాడు. "నేను నివసించే సమాజంతో నా సంబంధం ఏమిటి?" అన్నది కాక, " సంపూర్ణ విశ్వంతో నా సంబంధమేమిటి?" అన్న విషయం పైన అతని అన్వేషణ ప్రారంభమవుతుంది.

అతని అన్వేషణ లోతుగా సాగుతున్న కొద్దీ మరిన్ని వాస్తవాలను తెలుసుకుంటాడు. తనలో దాగి వున్న శక్తిని గుర్తించగలుగుతాడు. తాను వైవిధ్య లోకాలకు సంబంధించిన వాడిననీ తెలుసుకుంటాడు.

ఇక్కడి నుంచి సత్యకర్మ మొదలవుతుంది! ఎప్పుడైతే ఆత్మకు జ్ఞానం రావటం మొదలవుతుందో, అప్పుడు విజ్ఞానాన్ని అభ్యసించేందుకు కూడా చాలా అప్రమత్తతతో ఉండాలి! లేకపోతే తాను అన్ని విషయాలనీ చాలా త్వరగా నేర్చుకుంటున్నట్లు ఊహించుకుని తన అతీంద్రియ శక్తులతో చూసిన విషయాల్నే ' అంతిమ సత్యం ' గా భావించటం జరుగుతుంది!

మీరు చూసిన ప్రతీదీ, మీకు ఎదురైన ప్రతీదీ సత్యమే కానవసరం లేదు! ఈ సంపూర్ణ విశ్వంలో ఎన్నో విషయాలు, ఎన్నో వ్యాపకాలు విరామం లేకుండా నిరంతరం గా జరుగుతూంటాయి. ఈ రోజు మీరు చూసిన విషయం గానీ, వ్యాపకం గానీ రేపూ అదే విధంగా ఉండకపోవచ్చు.

అందువల్ల మీరు ఎంత విజ్ఞానాన్ని సంపాదించారో తెలుసుకోవటానికి మీకు ' జ్ఞానం ' అవసరం. ' జ్ఞాన ' మనే కవచాన్ని మీతో తీసుకుని వెళ్ళనంతవరకూ 'విజ్ఞానం' ద్వారా మోసపోవటానికి ఎంతో అవకాశముంది.

విజ్ఞానం ' ఒక సముద్రం ' లాంటిది. దాని నుండి మీరు ' ఒక బకెట్' నిండుగా నీరు తీసుకుని సంపూర్ణ సముద్రాన్ని తెలుసుకున్నట్లుగా భావిస్తే అది మీ అజ్ఞానాన్ని తెలుపుతుంది! సముద్రం గురించి మీకు కొంత భాగం తెలిసి ఉండవచ్చు. మీ అవగాహన ఏ విధంగా ఉన్నప్పటికీ, అది కొంతవరకే నిజం కావచ్చు. కానీ, పూర్తిగా మాత్రం ఎప్పటికీ కాజాలదు. ఈ విధంగా మీరు విజ్ఞానాన్ని గ్రహిస్తూ సంపాదిస్తూ విజ్ఞానాన్ని కూడబెడుతున్నప్పుడు, అంతిమ సత్యాన్ని చేరుకోనంత వరకూ, ' ఒక నిర్ణయాన్ని' తీసుకోకుండా చాలా జాగ్రత్త వహించాలి!

మీకు తెలిసినంత వరకే ప్రజలతో చర్చిస్తూ మార్గదర్శకత్వం చేస్తూ సలహాలివ్వచ్చు. ఎవరైనా అడిగిన ప్రశ్నకు జవాబు తెలియనట్లయితే, మీ జ్ఞాన పరిధికందని, పరిశీలించటానికి వీలులేని జవాబులు ఇవ్వక, ఆ ప్రశ్నకు సమాధానం తెలియదని ఒప్పుకుని, ప్రయత్నించి తెలుసుకుని చెబుతానని చెప్పండి!

ఎవరి నమ్మకాన్నైనా వమ్ము చెయ్యటానికి ఏ వ్యక్తికీ హక్కు లేదు. ఎవ్వరైనా తనకు తానుగానే అసత్యమైన మూఢ విశ్వాసాల్నీ, అశాస్త్రీయ పద్ధతుల్నీ పోగొట్టుకోవాలి. మీరు నమ్మిన సత్యాన్ని గురించి, తెలుసుకున్న విషయాల గురించి వివరంగా చెప్పవచ్చు లేదా చేసి చూపించవచ్చు; అంతేకానీ, వారు కూడా మీ మార్గాన్నే అవలంబించాలని బలవంతం చేయటానికీ, శాసించటానికీ మీకు హక్కు లేదు.

' నిజమైన మార్గం ' సామర్థ్యత కంపనాలని సృష్టించి, ఆకర్షించే శక్తి కలిగి ఉండటం వలన, యితరులని ఆకర్షించి వారంతటవారే తన మార్గాన్ని అనుసరించేలా చెయ్యగలదు! అందువలన ఎవరినైనా ' ఒప్పించటానికి ' ప్రయత్నం చేయవద్దు! మీరు అనుసరిస్తున్న మార్గం యొక్క లాభాల గురించీ, సౌష్టవాన్ని గురించీ మాత్రం చెప్పండి.

ఇప్పుడు మీకందరికీ చిరపరిచితమైన ఒక ఉదాహరణని చెప్పదలచాను - అది " నలుగురు గుడ్డివాళ్ళు - ఏనుగు " కథ.

ప్రతి ఒక్కడూ ఏనుగు యొక్క ఒక భాగాన్ని మాత్రమే స్పర్శించి, అది ఏ విధంగా ఉంటుందో వర్ణించటం వలన, నలుగురూ దాని రూపాన్ని

వివిధ రకాలుగా వర్ణిస్తారు. అందరి సమాధానాలనూ పరిశీలిస్తే నిస్సందేహంగా " ఏనుగు యొక్క ఒక భాగానికి సంబంధించినంత వరకూ వారందరూ సరిగ్గానే వర్ణించారు " అని మాత్రం చెప్పవచ్చు. కానీ, వాస్తవమైన సంపూర్ణ ఆకారాన్ని ఎవ్వరూ స్పర్శించి వివరించ లేదు! అందరి మాస్టర్ల విషయం కూడా యిదే విధంగా ఉండి, ప్రతి మాస్టరూ పూర్ణ సత్యంలో ఒక భాగాన్నే ఛవి చూసి అదే పూర్ణ సత్యమని భావించారు! అందువలన, ఇప్పటికీ, ఎక్కువ మంది వారు తెలుసుకున్న విషయాలను తప్పించి యితరులు కనుగొన్న వాస్తవాలకి విలువనివ్వక, తాము తెలుసుకున్నదే సత్యమని భావిస్తున్నారు.

సంపూర్ణ సత్యాన్ని తెలుసుకోవటానికి విశాల హృదయం ఉండాలి! ఎప్పటివరకైతే ఒకరు చెప్పిన బోధనలను గానీ, సత్యాలను గానీ స్వయంగా అనుభవించి, పరిశీలించరో అప్పటి వరకూ వాటిని పూర్తి పరిగణనలోకి తీసుకోనూవద్దు - త్యజించనూ వద్దు.

' సత్య కర్మ ' చర్చ నుండి చాలా దూరంగా వచ్చామనుకుంటున్నారా? లేదు! పైన చర్చించిన విషయాలన్నీ సత్యకర్మ లోని భాగాలే. తనను గురించి తాను తెలుసుకోవటం, సాధన చేయటం, ' అంతిమ సత్యం ' గురించి ఇంకా ఇంకా తెలుసుకోవటం, విజ్ఞానాన్నీ, జ్ఞానాన్నీ సముపార్జించటం - మొదలైనవన్నీ సత్యకర్మలో భాగాలే! కానీ, పై విషయాల్ని మనం ఏ విధంగా తెలుసుకుని, వాటిని ఏ విధంగా ఉపయోగించుకుంటామన్నది సత్యకర్మ యొక్క బంధాలతో మనకున్న స్వేచ్ఛ నిర్ణయిస్తుంది.

సత్యకర్మ నుండి మనం ఏ విధంగా స్వేచ్ఛను పొందగలం? సత్య కర్మ యొక్క పరీక్షలు ఏ విధంగా ఉంటాయి?

నిరంతరం గా చేసినటువంటి మంచి చర్యల వలన, క్రమబద్ధంగా చేసినటువంటి ధ్యానం వలన, ఒక దశలో ఆ వ్యక్తిలో అసామాన్యమైన విజ్ఞానం లభిస్తుంది.

ఈ విజ్ఞానాన్ని సక్రమంగా ఉపయోగించనట్లయితే అది తనకు తెలియకుండానే వేరే మార్గం వైపు లాగుతుంది. ఆత్మకు ఒక చెడు అవగాహన కలుగుతుంది. ఆ వ్యక్తికి విశాల హృదయం లేనట్లయితే, తాను కనుగొన్న విషయాలే వాస్తవమన్న వాదనకి దారులు వెదుకుతాడు! ఎవరైతే తాను కనుగొన్న విషయాలకి కారణాలు వెతుకుతారో వారికి అవి పుష్కలంగా లభిస్తాయి! అందువల్ల తాను నమ్మిన సత్యాలతో తృప్తి పడటానికి ఎటువంటి విషయాలైతే సహాయకారిగా ఉంటాయో వాటిని మాత్రమే కనుగొంటాడు. తద్వారా ఆ వ్యక్తి ఎంతో సమయాన్నీ, ఎంతో శక్తినీ వృధా చేసుకుంటాడు. అంతే గాక తాను కనుగొన్న విషయాల్నే ఎడతెరిపి లేకుండా యితరులతో పంచుకోవటంలో ఆహ్లాదాన్ని పొందుతాడు. అభిప్రాయాల్ని చర్చించటం, పంచుకోవటం అన్నది తప్పు కాదు. కానీ, ఎప్పుడైతే మీ అభిప్రాయాలే సత్యాలనీ, మీరు తెలుసుకున్న విషయాలు మాత్రమే ఖచ్చితమైనవనీ గట్టిగా వ్యక్తపరుస్తారో, " వీటి కంటే వేరే మార్గం లేదు " అని నొక్కి వక్కాణిస్తారో, " మేమే అందరికన్నా గొప్పవార " మని భావిస్తారో - అప్పుడు అహంకారం రంగంలోకి ప్రవేశించినట్లే! మీరు చెప్పే విషయాల్ని నిరూపించటానికి అసత్యాల్ని

మద్దతుగా తీసుకుంటారు. మీరు ఎంతో అభ్యసించారు! కనుక, యితరులను మీ భాషణతో, చర్యలతో తేలికగా తృప్తిపరచగలరు.

కనుక, ఎవ్వరూ కూడా స్వానుభవంతో సంపూర్ణ సత్యాన్ని తెలుసుకోనంత వరకు తాను అనుసరించే మార్గమే అంతిమ మార్గమని వాదన చేయరాదు. తాము వాస్తవంగా ప్రయాణించినంత వరకు మాత్రం ప్రజలకు చెప్పవచ్చు. మార్గదర్శం చేయవచ్చు. దానికి మించి ఊహాగానం చేసి చెప్పరాదు. పైన చెప్పిన విధానాన్ని అనుసరించకపోవటం వల్లనే తప్పుడు అవగాహనలు ప్రారంభమయ్యాయి.

ఒక వ్యక్తి తన కష్టార్జితంతో, నిరంతర సాధన కొనసాగించటం వలన, కొంత స్థాయిని పొందటం వలన ఆ స్థాయికి సంబంధించిన వాస్తవాలు ఎంతో అద్భుతంగా, ఆహ్లాదంగా ఉండటం వలన, అవే అంతిమ సత్యాలని తలవనారంభిస్తాడు. తాను అంతిమ సత్యాన్ని తెలుసుకో గలిగాననుకుంటూ సంతోషిస్తాడు. ఈ స్థాయిలోనే ప్రతి ఒక్కరూ అప్రమత్తతతో ఉండాలి.

**' అంతిమ ఆనంద ' మనేది ' సంతోషా ' ని కంటే ఉన్నత స్థాయి కలిగి పోల్చనలవి కానిది. చివరి స్థితి " అంతా ఒక్కటే " నన్న భావన కలిగి ఉండటమే!** సంపూర్ణ విశ్వాన్ని ఏక కాలంలో చూస్తూ, తెలుసుకుంటూ, అనుభవించటమే అంతిమ స్థితి. అంతా ' ఈ క్షణం ' లోనే ఉంటూ, నిరంతరం గా ఉంటుంది. అందువలన అంతిమ స్థితిని చేరుకోనంత వరకూ ప్రతి ఒక్కరూ పూర్తి అప్రమత్తత కలిగి ఉండాలి.

మీకు ఏదైనా ఒక వాస్తవం ఎదురైతే "అది వివిధ వాస్తవాలలో

ఒకటి " ని తలచి అనంత సత్య శోధనలో మరిన్ని వాస్తవాలు చవిచూడటానికి ఎదురు చూస్తున్నట్లుగా భావించాలి. ఈ విధంగా నిత్య అభివృద్ధి చెందుతూ చెడు అవగాహనలకతీతంగా ఉండాలి.

ఎప్పుడైతే మీరు తప్పుడు అవగాహనలకి తావు యిస్తారో, మీరు సంపాదించిన విజ్ఞానంతో రక్షణ కల్పిస్తారో, అప్పుడు ఎవరైతే మీ త్రోవననుసరిస్తున్నారో, వారి ప్రగతికి అడ్డుగా నిలిచినవారై వారి జన్మ హక్కు అయినటువంటి స్వయంగా తెలుసుకొన గలగటానికీ, మీ స్థాయిని మించి అభ్యసించగలిగే శక్తికీ అడ్డుపడిన వారవుతారు!

కనుక, మీ స్థాయిని గురించి అభ్యసించటానికి, యితరులను తప్పుడు అవగాహనలకు గురి చేయకుండా ఎలా బోధన చేయాలన్నది నేర్చుకోవటానికి మళ్ళీ జన్మ తీసుకుని ఎక్కువగా శ్రమించి సూక్ష్మమైన సత్యాలను విస్తారం చేస్తారు.

**మీరు గత జన్మల్లో కొందరి మనసుల్లో సృష్టించిన తప్పుడు అవగాహనలు యిప్పటికే ' కొండలుగా పెరగటం ' వలన ఈ జన్మలో వాటిని పారద్రోలటానికి ఎక్కువ శ్రమించాలని గ్రహిస్తారు. ఎంతమంది ప్రజలలో ఈ తప్పుడు అవగాహనలని విత్తన రూపంలో నాటారో, వారందరి సంఖ్య కంటే ఎక్కువ ప్రజలకున్న సందేహాలను ఎప్పటివరకైతే మీరు తీర్చరో అప్పటి వరకూ మిమ్మల్ని ఈ కర్మచక్రం విడువదు!**

అందువల్ల ఎప్పుడూ సత్యాన్నే చెప్పాలి! ఏదో ఒక బృందానికి దగ్గరవ్వటం కోసం, సత్యానికి కొంత రంగు చేర్చటం వలన మీరు

ఎటువంటి ప్రగతినీ సాధించలేరు! సత్యానికి మీ ఊహలను జతచేయటం వలన, మీరు యితరులను తప్పుడు త్రోవ పట్టించిన వారే కాక, మిమ్మల్నే మీరు మోసగించుకుంటున్నారనీ గ్రహించండి.

ఆధ్యాత్మిక ప్రగతికి మూడు విషయాలతో సంబంధం వుంది.. అవేమంటే ' తెలుసుకొనటం ', ' చూడటం ', ' అనుభవించటం '.

ఒక స్థాయికి చేరిన తరువాత సత్య-అసత్యాలను మీరు తెలుసుకొనగలుగుతారు. తరువాత మీరంతట మీరే వాస్తవాలని చవి చూడగలుగుతారు. కానీ, మీరు సత్యాన్ని స్పర్శించనంత వరకూ, వాస్తవాలననుభవించనంత వరకూ, మీరు అంతిమధ్యేయాన్ని చేరానని తలచవద్దు. మీరు ఏం నేర్చుకున్నా యితరులకు కూడా చెప్పటానికి తప్పక ప్రయత్నించండి. కానీ ' వాదనల ' లోకి మాత్రం దిగవద్దు. ప్రతి ఒక్కరి అనుభవం భిన్నంగా ఉంటుంది.

ప్రతి ఒక్కటీ ఆత్మాభివృద్ధికి సహాయ పడుతుంది. అన్ని విషయాలనూ వింటూ, విశాలహృదయం కల్గి వుండటం వల్ల సత్యాన్ని చూసి, అనుభవించి, అభ్యాసం చేయగలుగుతారు. ఎటువంటి స్థితిలోనూ మీ విజ్ఞానాన్ని చూపి గర్వపడరాదు. " ఆధ్యాత్మిక మార్గం లో నేను కూడబెట్టిన విజ్ఞానం అవసరమున్న వారికి ఉపయోగపడగల్గితే నాకు సంతోషం " అనే ఉద్దేశ్యమే ఎల్లప్పుడూ కల్గి ఉండాలి.

కొంత స్థాయికి చేరుకున్న తరువాత, కొంత మంది యితరులకు దూరం గా, ఒంటరి గా వున్న ప్రదేశానికి వెళ్ళటం వలన, వారి

ప్రగతి త్వరితంగా ఉండవచ్చునని భావిస్తారు. ప్రాపంచిక విషయాలకు దూరంగా వున్న ప్రదేశం వారికి ఆత్మ పరిశీలనలో తోడ్పడుతుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు. కానీ వారు గుర్తుంచుకోవలసిన విషయమేమంటే, కొంత ప్రగతిని సాధించిన తరువాత యితరులకీ, వారి సత్యశోధనలో సహాయపడటానికీ, ఈ " సాధారణమైన ప్రపంచానికి " తిరిగి రావాలి. అలా కానట్లయితే వారు సంపాదించిన విజ్ఞానం వలన ఎంత మాత్రం ఉపయోగం లేదు! ఆధ్యాత్మిక ప్రగతి పథంలో కొంత స్థాయికి ఎదిగిన తరువాత వారి హృదయం నిరంతరమైన ప్రేమానురాగాలతో, దయతో పొంగి పొర్లటం వలన యితరులకు సహాయపడాలని కోరుకుంటారు. తాము అనుభవించే సంతోషం, ప్రశాంతత, ఆనందాన్ని ఈ విశ్వంలో ప్రతి ఒక్కరూ అనుభవించాలని తలుస్తూ, వేరే యితర స్వల్ప ఆలోచనలకు తావు ఇవ్వకుండా, యితరులతో మాట్లాడుతూ, వారికి తగిన సలహాలనిస్తూ ప్రగతి పథం వైపు వారిని కూడా నడిపించటం ప్రారంభిస్తారు.

గతంలో కూడా కొందరు గొప్ప మాస్టర్లున్నారు. కానీ వారు 'వేరు' గా ఎందుకు ఉన్నారు? ఈ భూలోకంలో జనన-మరణ చక్రాన్ని అధిగమించిన తరువాత యితర లోకాలలో కూడా ఆత్మాభివృద్ధికి అవకాశం ఉంది. ఆధ్యాత్మిక ప్రగతినను సరించి ఆత్మలు వారి వారి స్థాయికి తగిన సూక్ష్మలోకాలకి చేరటం జరుగుతుంది. కనుక, గతంలో ఉన్న మాస్టర్ల ఆధ్యాత్మిక ప్రగతి వివిధ స్థాయిలలో ఉన్నదని

చెప్పవచ్చు. వారేం చెప్పినా, వారు అభ్యాసం చేసినంత వరకే అది పరిమితం గా ఉండింది. " వారిలో ఎవరు గొప్ప? "- అనే చర్చలోకి మనం దిగకూడదు. దానికి బదులుగా, " ఏ విధంగా కొన్ని అసత్యపు అవగాహనలు గందరగోళాన్ని సృష్టించి, వివిధ ఆత్మ సమూహాలకి ఎంత అసౌకర్యాన్ని కలిగించాయో " నన్న విషయాన్ని మనం గమనించాలి.

మనం ' సత్యకర్మ ' విషయాన్ని సాగదీస్తూ వచ్చామనుకోవద్దు. మనం చర్చించిన ప్రతి ఒక్క వివరణ 'సత్యకర్మ'కు సంబంధించినదే!

వివిధ సామాజిక పరిస్థితులలో జీవించిన మాస్టర్లు, వారి వారి కాలాల్లో ఉన్న స్థితిగతుల కనుగుణంగా బోధనలు చేసారు. ఈ విషయాన్ని మనస్సులో ఉంచుకుంటూ ఈ క్రింది సత్యాలని పరిశీలిద్దాం.

ఎందరో మాస్టర్లు ఈ భూలోకంలో జన్మ తీసుకున్నారు. ఎవరేం బోధించినా ఒక విషయంలో మాత్రం నిస్సందేహంగా తేల్చినదేమంటే -" భగవంతుడు ఒక్కడే! ఆయన ప్రతిరూపమే అన్ని జీవుల్లో ఉన్నది ". కానీ, మిగతా విషయాలలో వివిధ అభిప్రాయాలుండటం వలన, చాలా సందేహాలకు అవకాశాన్నిచ్చి, గందరగోళాన్ని సృష్టించి, వివిధ శాఖలు ఉత్పన్నమవ్వటానికి దారి తీసింది.

ఏ మాస్టర్ కూడా మతాన్ని స్థాపించలేదు! మాస్టర్ల అనుచరులే తమ తమ స్వలాభాల కోసం వివిధ మతాలని ప్రారంభించారు!

మాస్టర్ల బోధనలని వారు పూర్తిగా అర్థం చేసుకోలేదు. ప్రజలలో

ఎలుకుబడిని పెంచుకోటానికీ, వారిని తమ ఆధీనంలో ఉంచుకోవటానికీ మాస్టర్లు చేసిన బోధనలను వారి శిష్యులు అభ్యంతరకరమైన పద్ధతులలో మార్పులు చేసి, వారి వారి స్వంత ఊహలను కూడా జత పరచారు. వారి ముఖ్య ఉద్దేశ్యమేమంటే, ప్రజలను వారి ఆధీనంలోకి తీసుకోవటం వలన, వారి కోరికలను సంగ్రహించి, శారీరక, మానసిక వాంఛలను తీర్చుకుంటూ తిరుగులేని అధికారాన్ని పొందటం. కనుక, మనం మాస్టర్లని ఏ విధంగా చూసినా తప్పు పట్టలేం.

" మాస్టర్లు, వారి బోధనలను విపరీతార్ధాలకు తావు నిచ్చే విధంగా ఎందుకు బోధించారు? "-కొందరి మేధావుల మనస్సులో తరచుగా ఉదయించే ప్రశ్న యిది. అన్ని సందేహాలలో ముఖ్యమైనది - " స్వర్గ నరకాలనేవి ఉన్నాయా? " ఎక్కువ మంది మాస్టర్లు - బుద్ధుడు తప్పించి- తమ బోధనలలో స్వర్గ నరకాలు ఉన్నాయని నిర్ధారించారు. ఎంతవరకూ యిది సత్యం? వాస్తవానికి భగవంతుడు ' స్వర్గా ' న్నీ, ' నరకా ' న్నీ సృష్టించలేదు!

మొట్టమొదట ' నరకం ' గురించి చర్చించుకుందాం. మాస్టర్లందరూ బోధించినదేమంటే - ఒకరు మంచి పనులు చేయటం వలన ఈ భూలోకం కంటే ఉన్నతమైన లోకాన్ని ప్రవేశించి అక్కడ మరింత గొప్ప విజ్ఞానాన్ని సంపాదించి తమ ఆత్మాభివృద్ధి చేసుకోవచ్చు. అన్యధా భూలోకం వీడిన తరువాత కష్టాలు అనుభవించవలసి వస్తుంది. ఇది మౌలిక బోధన. మాస్టర్లు తాము స్వయంగా కనుగొన్న వాస్తవాలను ఒకసారి ప్రజల ముందు వ్యక్త పరచిన తరువాత, ఇక వారి శిష్యులు

మాస్టర్లు కనుగొన్న సత్యాలని బోధించేవారు. మొదట్లో ఏ మాత్రం సందేహం లేకుండా మాస్టర్ల బోధనలని చక్కగా ప్రచారం చెయ్యగలిగేవారు. కానీ, తరం గడిచిన తరువాత వచ్చిన శిష్యుల యొక్క శిష్యులలో నిజాయితీ లోపించటం వలన, మాస్టర్లతో సరాసరి అనుసంధానం లేకపోవటం వలన, వారి బోధనల అర్థాలన్నీ పూర్తిగా అవగాహన చేసుకోలేదు. ఈ సమయంలో ప్రజలు వివిధ లోకాల గురించి వివరాలు అడగటం ప్రారంభించారు.

" దేవుడు సృష్టించిన లోకాల్లో ' ఒకటి మంచిది ' ' వేరొకటి చెడ్డది ' గా ఎందుకు ఉంది? ", " మన అజ్ఞానం వలన తప్పులు చేస్తున్నాం - అప్పుడు దేవుడు మనకి శిక్ష ఎలా విధించ గలడు? "- మొదలైన ప్రశ్నలు శిష్యులను జనాబుల కోసం ' ఊహించటా ' నికి దారి తీసి, ప్రజల మీద ఆధిపత్యాన్ని సంపాదించాలన్న ఉద్దేశ్యం కలిగిన శిష్యులు, " స్వర్గ - నరకాలు అనేవి ఉన్నాయి " ని చెప్పారు. మంచి పనులు చేయటం వలన స్వర్గానికీ, చెడు చేయటం వలన నరకానికీ వెళ్తారని బోధించారు.

ఇప్పుడు పై ప్రశ్నలుదయించిన కాలంలో ఉన్న సామాజిక స్థితిని మీరు అర్థం చేసుకోవాలి. ఆ రోజుల్లో ప్రజల వృత్తి ననుసరించి వివిధ వర్గాలుగా విభజించబడ్డారు. అందువలన ఎక్కువ మందికి విద్యనభ్యసించే అదృష్టం లేదు. వారిలో ఉన్నత వర్గాల వారికి మాత్రమే విద్యనభ్యసించే సౌకర్యం వుండింది. నిమ్న వర్గాలకి చెందిన ప్రజలు నిరక్షరాస్యులుగా మిగలటం వలన, మాస్టర్లు ఏం బోధించారన్నది

తెలియదు. వారు విజ్ఞానం కోసం యితరుల మీద ఆధారపడవలసి వచ్చేది.

స్వలాభ చింతనలో వున్న ఉన్నత వర్గీయులు స్వర్గ - నరకాల అవగాహనతో ప్రజల మనస్సులను పాడు చేసారు. వారు బోధించే విషయాలకు తగిన బలాన్ని చేకూర్చటానికి విగ్రహాలను ఆరాధించటం, దేవాలయాలని కట్టడం ప్రారంభించారు. వారి ఊహలతో మరింత మంది దేవుళ్ళను కూడా సృష్టించారు. ఎవరికైతే వాక్ చాతుర్యం ఉందో వారు తమ కనుగుణంగా ప్రజలనాడించారు. కాలక్రమేణా శిష్యులు, తాము సృష్టించి బోధించినవి అవాస్తవాలని మరచి, ప్రజల ఆలోచనా శక్తితో, ఆమోఘమైన విశ్వాసాలతో, బలాన్ని చేకూర్చుకున్న విగ్రహారాధననీ, దేవాలయ నిర్మాణాలనీ వారే స్వయంగా నమ్మటం ప్రారంభించారు !!

ఈ శిష్యులు కొంత గందర గోళాన్ని సృష్టించినప్పటికీ, వారి నిత్య జీవిత కఠోర పరిశ్రమ, క్రమశిక్షణలకు ప్రతిఫలంగా ఒకానొక ఉన్నత లోకానికి వెళ్ళ గలిగారు. ఆ లోకం తన ప్రకృతి సహజమైన అందాలతో ఎంతో అద్భుతంగా ఉండటం వలన, దాన్నే ' స్వర్గం ' గా భావించి ఒక రూపాన్ని ఊహించి దేవుడి కోసం అన్వేషించారు. ఎవరైతే పై విధంగా అన్వేషించారో వారి మనోభీష్టానికనుగుణంగా ' దేవుడి 'ని చూడగలిగారు! అందువల్ల వారు తమ భవిష్యోన్నతి ని లెక్క చేయక అసత్యమైన ఆనందాన్ని అనుభవించటంలోనే వారి పూర్తి సమయాన్ని

వెచ్చిస్తూండటం వలన, ఆ లోకంలో వారు నివసించే సమయం ముగిసి, తిరిగి జన్మను తీసుకోవలసి వచ్చినప్పుడు వారి తప్పును తెలుసుకునేటప్పటికి చాలా ఆలస్యమైంది.

భూలోకంలో జన్మ తీసుకున్న తరువాత కూడా, ఆ లోకంలో దీర్ఘకాలంగా ఉండటం వలన దాని అందానికీ, గొప్పతనానికీ ఉక్కిరిబిక్కిరై భూలోకంలో కూడా తమ జీవితాల్లో దాని భవ్యతను అప్పుడప్పుడూ పొందగలుగుతున్నారు. ఏదో పొందాలన్న వాంఛ వలన, మరింత అందమైన, మరింత సుఖవంతమైన, మరింత ఆహ్లాదాన్నిచ్చేదేదో చవిచూడాలన్న కోరిక వలన, వారు ఆ లోకంతో తమ బంధాల్ని త్రెంచుకొనలేక, దాని మీదనే యింకా విశ్వాసాన్నుంచి జీవిస్తున్నారు.

వేరొక బృందానికి చెందిన వారు తెలిసో తెలియకో కొన్ని తప్పులను చేసినప్పటికీ ఎప్పుడూ తప్పు చేసామనే చింతతో తాము నరకంలోకి ప్రవేశించటాన్నే ఊహిస్తూంటారు. ఆ కాలంలో నరకాన్ని వర్ణిస్తూ కథలుండటం వలన, మానవుడి మనస్సుకి అమోఘమైన ఊహాశక్తి ఉండటం వలన, వారు చేసిన చెడ్డ పనులకు వివిధ రకాల శిక్షలనూహించటం ప్రారంభించారు. అందువలన, ఈ ఆత్మలు భూలోక జీవితానంతరం ఉన్నతమైన లోకానికి (పుణ్యాం చేసుకున్న వారు చేరుకున్న లోకమే) వెళ్ళినప్పటికీ వారు ఊహించిన విధంగానే నరకాన్ని చూడటం జరిగింది.

నిజానికి ' నరక ' మనేది లేనేలేదు! ఎంత హీనమైన సూక్ష్మ

లోకమైనా కూడా వాస్తవానికి అది మంచి లోకమే కానీ ఆత్మల చెడు ఊహల వల్ల అది కుళ్ళిపోయింది. ఇదే లోకంలోకి ఒక ఉన్నత కోవకు చెందిన యోగి ప్రవేశించినప్పుడు నరకమన్నది లేదన్న జ్ఞానం కలిగి ఉండటం సర్వసాధారణం.

వాస్తవానికి అన్నింటికన్నా ముఖ్యమైన దేమిటంటే ' విశ్వాసం '. కనుక, మనం ఎప్పుడూ కూడా తప్పుడు విశ్వాసాలకు తావివ్వరాదు. ఈ లోకంలో తక్కువ పరిణామం చెందిన ఆత్మలు, ఏ మాత్రం అభివృద్ధి చెందని ఆత్మలు, తమ తమ కర్మలననుసరించి, తమ తమ ఊహలననుసరించి ఎంతో భయంకరమైన బాధలననుభవిస్తున్నారు. వారందరి అజ్ఞానాన్నీ దూరం చేయటం మనందరి కర్తవ్యం. ఈ మూఢ నమ్మకాల సంకెళ్ళను పారద్రోలితే వారంతట వారే బయటకు రాగలరు! మూఢనమ్మకాలు వారి ఆత్మాభివృద్ధికి తోడ్పడక పోగా తప్పుడు మార్గంలోకి తీసుకు వెళ్ళి, వారి గమ్యాన్ని వారికి దూరం చేస్తున్నాయి! పరిణామ క్రమంలో అభివృద్ధి చెందిన ఎన్నో ఆత్మలు మాస్టర్ల సహాయంతో అనవసరమైన జ్ఞాపకాలనూ, మూఢనమ్మకాలనూ ప్రజల మనస్సుల నుండి తుడిచి వేయటానికి ప్రయత్నం చేస్తున్నారు!

ఊర్ధ్వలోకాల మాస్టర్లు అందరికీ సహాయం చేయాలని ఎంతో ఉత్సుకతతో ఎదురు చూస్తున్నారు! ఈ వినాశానికి ఆ మాస్టర్లు కారణం కానప్పటికీ మొదట్లో వారు దీనిని ఆపటానికి ప్రయత్నం చేయలేదు. కారణమేమంటే " ఫ్రీవిల్ క్షేత్రం " లో వున్న ప్రజలను

ప్రభావితం చేయగల శక్తి అప్పుడు వారికి లేదు. ఇప్పుడు వారు బాగా అభివృద్ధి చెంది, ఎంతో శక్తినీ, జ్ఞానాన్నీ సాంపాదించి, అందరిలో మూఢ నమ్మకాలను వారు ఉద్దేశ్య పూర్వకంగా సృష్టించనప్పటికీ వాటిని నిర్మూలించాలని ప్రయత్నం చేస్తున్నారు. వారు వివేక క్షేత్ర మాస్టర్ల సహాయం తో వాస్తవాలను భూలోకంలో ముమ్మరంగా ప్రచారం చేస్తున్నారు.

' స్వర్గలోక అవగాహన ' అన్నది ' నరకం యొక్క అవగాహన ' కంటే ఆత్మాభివృద్ధికి ఎంతో ప్రమాదకరమైనదే కాక హానిని కూడా కలిగిస్తుంది!

' నరకం ' యొక్క అవగాహనలో ఆత్మకి కొంత జాగరూకత కలిగి, తన వంతు శిక్షననుభవించిన తరువాత యిదే అంతిమ దశ కాదని తెలుస్తుంది. కానీ, ' స్వర్గలోక ' అవగాహన ఎక్కువగా భ్రమని కలిగిస్తూ, ఆ లోకంలోనే సుఖాల ననుభవించవచ్చుననే నమ్మకాన్ని కలిగిస్తుంది.

అంతేకాకుండా, స్వర్గం (అజ్ఞానంతో ప్రజలచే సృష్టించబడ్డ లోకం) లో ఆత్మలు ఎంతో అభివృద్ధి చెంది ఎక్కువ విజ్ఞానం కలిగి ఉండటం వలన వారి ఆలోచనా ప్రకంపనలు ఎంతో శక్తివంతమై ప్రతి ఆత్మ అదే వాస్తవమని తలుస్తూ, అంతకంటే వేరే మంచి ప్రదేశం లేదనీ, చేయవలసిన పని యింకేమీ లేదన్న భావన కలిగి ఉంటారు. కానీ, వాస్తవం దానికి వ్యతిరేకంగా ఉంది.

ఆత్మాభివృద్ధి చెందుతున్న కొద్దీ ఊపిరి సలపనంతగా పని

పెరుగుతుంది. కానీ ఆ పనిని వారు ఆడుతూ - పాడుతూ చేస్తారు. పని చేయటంలో సంతోషాన్ని పొందుతారు; సోమరితనం ఉండదు.

కానీ, ఆ లోకంలో సోమరితనం ఎక్కువై పట్టుదల సడలుతుంది. ఆ లోకంలో తన సమయం పూర్తి అయ్యే వరకు, మరింత అభ్యసించటానికి కోరిక ఉండదు. ఆ సంకెళ్ళ నుంచి బయట పడటానికి యిష్టపడరు. కనుక మీ మంచి కర్మల వల్ల ఒకసారి ఆ లోకానికి చేరగల్గితే " యిది కూడా ఆత్మాభివృద్ధికి ఒక బాట మాత్రమే "నని తలవాలి. ఈ లోకంలో ఏమేమున్నాయో తెలుసుకుని అవి తన ఆత్మ పురోగతికి ఏ విధంగా తోడ్పడగలవన్నది గమనించాలి.

ఈ విధంగా చేయటం వలన ఆ లోకాన్ని తేలికగా దాటగలగటమే కాక, క్రొత్త మంచితనాన్నీ మీరు సంక్రమించుకోగలరు. ఆ లోకంలో వున్న మంచి విషయాలన్నింటినీ అభ్యసించగలరు. మరొక్కసారి ప్రత్యేకంగా చెప్పాలంటే, ఆ లోకం ఒక అద్భుతమైనది. సుఖశాంతులు, ప్రేమ వాత్సల్యాలతో నిండి ఉన్నది. అయితే అది మీ ' గమ్యం ' కాదు.

ఆ లోకంలో మీకు కేటాయించిన సమయం కంటే ఎక్కువగా గడపాలని కోరిక కలిగినట్లయితే మీరు సుఖాలను వీడి బయటకు రావటం యిష్టపడటం లేదన్న అర్థాన్ని స్ఫురిస్తుంది. కోర్కెలను తీర్చుకోవటం, సుఖాలననుభవించటం మంచిదవ్వచ్చు, లేదా చెడ్డదవ్వచ్చు, లేదా గొప్పదవ్వచ్చు. కానీ వాటి వలన మన ఆత్మల పైన కొంత ప్రభావం కలిగి, జీవితచక్రంలో కొంత బంధాన్ని ఏర్పరచి తిరిగి మనల్ని క్రింది లోకాలలో కర్మ చేయించటానికి కారణభూతమవుతుంది.

అందువలన ఈ విజ్ఞానాన్ని మన మనస్సులో ఒక ' కంప్యూటర్ చిప్ ' మాదిరిగా దాచుకుని, ఆ లోకం ఎంతో ఆహ్లాదాన్నిచ్చే లోకమనీ, దేనితోనూ పోల్చనలవి కాదనీ, అయినా అది మన ' అంతిమ లక్ష్యం ' కాదనీ జ్ఞప్తికి తెచ్చుకోవటం కోసం ఉపయోగించుకోవాలి. ఈ విజ్ఞానంతో నిండిన ఆ చిప్ మనకి అవసరమైనప్పుడు తగు ప్రేరణ కలిగిస్తూంటుంది.

ఏ ఆత్మలైతే సుఖాలలో మునిగిపోయి, ఆ లోకమే శరణ్యమని తలుస్తారో వారు భూలోకానికి కొంత జ్ఞానంతో తిరిగి వచ్చి స్వర్గాన్ని గురించి బోధించటం ప్రారంభిస్తారు. వారు స్వర్గలోకం పట్ల ఎంతో విశ్వాసం కలిగి, అదే అంతిమ సత్యమని భావిస్తారు. ఎల్లవేళలా కొంత మంచిని, కొంత ఆనందాన్ని, కొంత సుఖాన్ని కోరుకుంటున్న ప్రజా సమూహం వీరి బోధనలకు చాలా ప్రాముఖ్యత నిచ్చి ఆ లోకాన్ని (స్వర్గ లోకాన్ని) చేరాలని కృషి చేస్తూంటారు. అందువలన అంతిమ సత్యాన్ని తెలుసుకోవాలని కోరిక కల్గినవారు స్వర్గ - నరకాల అవగాహన ఎల్లప్పుడూ జ్ఞప్తికి ఉంచుకోవాలి.

**" నవ్యయుగం యొక్క మతం (The New Age Religion) "-నవ్య యుగానికి సంబంధించిన మాస్టర్లు - ఎంతో జ్ఞానం కలవారు.**

వారు పలికిన ఒక్కొక్క వాక్యంలో ఎంతో, ఎంతో అర్థం నిబిడి ఉండి, ప్రశ్నలు ఇక వేయనవసరం లేకుండా వెంటనే అనుసరించతగినవన్న ఉద్దేశ్యాల్ని కలిగిస్తాయి. ప్రవచించబడిన బోధనలు చూసిన వెంటనే, వినిన వెంటనే సత్యాన్ని గోచరింపచేస్తాయి.

వాటిల్లో ఎంతగానో వాస్తవాన్ని నింపుకున్న వాక్యం - " మన వాస్తవాలకి మనమే సృష్టికర్తలం " - అవును! ఎవరి వాస్తవాలని వారే సృష్టించుకుంటారు. ఒక వ్యక్తి కొంత మంచిని పొందాలని లేదా తెలుసుకోవాలని తలచనంత వరకూ మనం అతన్ని ఏ విధంగానూ ఒప్పించలేం.

అందువలన, మేం మళ్ళీ మళ్ళీ చెప్పేదేమంటే, మీరు ఒక వ్యక్తికి మార్గదర్శకత్వం చేసి, అనుమానాలని తీర్చి తన స్వయంకృషితో తన మార్గాన్ని ఏర్పరచుకోమని చెప్పండి. మనలో వున్న శక్తినంతటినీ ఉపయోగించినప్పటికీ, స్వంత యిష్టానికి వ్యతిరేకంగా, ఏ వ్యక్తినీ కూడా అజ్ఞానం నుండి బయటకు తీసుకురాలేం! కర్మచక్రాన్ని గురించి తెలుసుకోనంత వరకూ ఎవ్వరూ కూడా దాని పర్యవసానం నుంచి బయటపడటానికి అవకాశం లేదు!

అందువలన ఎవరైనా తమ ఆధ్యాత్మిక మార్గంలో కనుగొన్న విషయాలను, వారికి ఎదురైన సంఘటనలు బాగా తెలిసినప్పుడు మాత్రమే ఎంతో జాగ్రత్త వహించి వివరించాలి. మీరు కనుగొన్న వాస్తవాలని మీ ఊహలతో మిశ్రణ చేయవద్దు. మీ సాహిత్యానికి అందమైన పదజాలాన్ని తొడగవచ్చు; కానీ తగు జాగ్రత్త వహించి దానిని ఎవరు వివరించారో, ఎవరి అనుభవంలోకి వచ్చిందో, ఏ పుస్తకాలలో వ్రాసారన్న విషయాన్ని తప్పకుండా చేర్చాలి.

ఈ విధంగా చేయటం వలన మనం చెడు అవగాహనల్ని రూపుమాపగలం. అంతేకాకుండా వినేవారిపైన కూడా మనం చెప్పేది చాలా

ప్రభావం చూపుతుంది. మనం చెప్పేదాన్ని వినే వ్యక్తి మొట్టమొదటగా తెలుసుకునేదేమంటే - ఈ వ్యక్తి తనకు బాగా తెలిసినవి, బాగా అనుభవంలోకి వచ్చిన విషయాల్ని మాత్రమే బోధిస్తాడనీ, ఆయన ద్వారా సరైన మార్గదర్శకత్వం పొందవచ్చుననీ, తనని అగమ్యగోచరానికి గురి చెయ్యడనీ.

పైన చెప్పిన విషయాలని బాగా అర్ధం చేసుకోగల్గితే మనం సత్యకర్మకి దూరంగా ఉండగలం. అవాస్తవాలను ప్రచారం చెయ్యటం, బోధించటం, పూర్తి స్పృహ లేకుండా మార్గదర్శకత్వం చేయటం వలన - మనం సత్యకర్మకు లోనై ప్రజలను అంధకారంలో ఉంచుతూంటాం. మన తప్పులను తెలుసుకుని సరిదిద్దుకోనంతవరకూ మళ్ళీ మళ్ళీ ఈ భూలోకంలో జన్మిస్తూంటాం.

" ' కర్మచక్రం ' లో అందరూ బందీలుగా ఎందుకున్నా " రన్న ప్రశ్నను చర్చించే ముందుగా యిప్పటిదాకా తెలుసుకున్న విషయాలను వివరిస్తాను.

దేవుడు రెండు క్షేత్రాలను ఎందుకు సృష్టించాడు?

సృష్టికర్త ప్రేమ స్వరూపుడు. తనలో భాగాలైన ఆత్మలు కూడా తనలాగే సృష్టించగలగాలనీ, తనకి తెలిసిన పరమ సత్యాన్ని వారు కూడా తెలుసుకోవాలనీ తలచాడు.

పరమ సత్యాన్ని అర్ధం చేసుకోవాలంటే ఆత్మలు కోర్కెలనూ, ఉద్వేగాలనూ అనుభవించాలి. ఈ కోరికల, ఉద్వేగాల ఆట ' ఎక్కువ '

గా ఆడినట్లైతే తప్పకుండా అజ్ఞానంలోకి దిగుతాం! సత్యమైన ప్రేమనీ, సత్యమైన ఆనందాన్నీ, సత్యమైన జ్ఞాన - విజ్ఞానాల్నీ తెలుసుకోవాలంటే పరీక్షలన్నింటినీ ఎదుర్కోవాలి.

సృష్టికర్త ఒక ఆదర్శ తండ్రి లాగా ఆత్మలన్నింటికీ ఏవేని ప్రయోగాలు చేయటానికి పూర్తి స్వాతంత్ర్యాన్ని యిచ్చాడు. వారి అభివృద్ధిలో ఎప్పుడూ తాను కల్పించుకోనని నిర్ణయించుకున్నాడు. అప్పుడు ఆత్మ యొక్క ప్రగతిని ఏ విధంగా కొలవాలి? అందువలన ఆయన ఒక " విశ్వసూత్రాన్ని - (Universal Law) కర్మ చక్రాన్ని " నిర్మించాడు.

ఎప్పుడైతే ఆత్మ తన పరిణామ క్రమంలో ఒక స్థాయిని చేరుతుందో దానికి ఆ చట్టం అందుబాటులో ఉంటుంది. ఎవరైతే నిజాయితీగా అన్వేషిస్తారో వారికి అవసరమైన జ్ఞాన-విజ్ఞానాలను ఈ చట్టం అందజేస్తూ, తగని విధంగా ఎవ్వరూ లబ్ధి చెందకుండా చూస్తుంది. ప్రతి ఒక్క ఆత్మ తన ఉన్నతికి పరిశ్రమ చెయ్యాలి. అందువల్లనే స్వచ్ఛంద క్షేత్రం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు, వాంఛలు, ఉద్వేగాలు కలిగినదిగా పని చెయ్యటం మొదలు పెట్టింది.

సృష్టికర్త తన ముందు చూపుతో, ఆత్మలు ఒక స్థాయిని చేరిన తరువాత వాంఛా, ఉద్వేగాలవలన గమ్యాన్ని చేరటానికి, అజ్ఞానాంధకారాలు అడ్డుగా వుంటాయని గ్రహించి, వారికి సహాయపడటానికి " వివేక ఆత్మలుండే క్షేత్రాన్ని " సృష్టించాడు.

వివేక క్షేత్రంలో విజ్ఞానం ఎక్కువగా వుంది. ప్రగతి త్వరితగతిలో ఉంది. సృజనాత్మక శక్తి అసామాన్యంగా ఉంటుంది. కానీ పరిణామానికి సంబంధించినదైన రెండవవైపు వున్నటువంటి ' ప్రేమ ', ' ఉద్వేగాల ' జ్ఞానాన్ని లోపించి ఉంటారు. ఈ క్షేత్రంలో వున్న ఆత్మలు వారికున్న సృజనాత్మక శక్తి కారణంగా స్వార్థ చింతనతో తాము భగవంతునితో సమానమని తలుస్తారు. కానీ, స్వచ్ఛంద క్షేత్రం నుండి ఉన్నత శిఖరాలకు ఎదిగిన మాస్టర్లు వాంఛారహితంగా ఉండటం వలన అనంతంగా పొంగి ప్రవహిస్తున్న ప్రేమాభిమానాల వలన, ఈ లోకానికి సహాయపడాలని తలుస్తారు. అంతేకాక వివేక క్షేత్ర ఆత్మలు అజ్ఞానం ఎక్కువ పరిమాణంలో ఉన్నటువంటి స్వచ్ఛంద క్షేత్రానికి ఉపయోగపడగలరని భావిస్తారు. కనుక వారి శక్తితో, సహనశీలతతో వివేక క్షేత్రానికి సంబంధించిన కొన్ని ఆత్మలను పరిణామ క్రమం యొక్క రెండవవైపుని చవిచూడటానికి స్వచ్ఛంద క్షేత్రానికి తీసుకురావాలని ప్రయత్నిస్తారు. వారికి జ్ఞానాన్ని అందించటానికి సరైన సమయం కోసం, సరైన ఆత్మ కోసం వేచి ఉంటారు. వారి కృషి స్వార్థ రహితంగా ఉండటం వలన కొన్ని ఆత్మలు వారి మార్గం వైపు మరలటం ప్రారంభించాయి.

**ఇప్పుడు వివేక క్షేత్రంలో కూడా ఎన్నో మార్పులు జరుగుతున్నాయి. వివేక క్షేత్ర ఆత్మలు, త్వరితగతితో పరిణామం చెందటానికి సత్యానికి రెండవ వైపున ఉన్న అనుభవాలను పొందాలని గ్రహించి స్వచ్ఛంద క్షేత్రంలో జన్మ తీసుకోవటానికి నిర్ణయించుకుంటున్నాయి.**

ఇక్కడ మరొక గ్రహించదగ్గ విషయమేమిటంటే, ఆత్మాభివృద్ధి

కోరుకుంటున్న ఆత్మలకి, తమ క్షేత్రాన్ని మార్చుకోవటానికి కూడా అవకాశం ఉంటుంది.

స్వచ్ఛంద క్షేత్రంలోకి ఒకసారి ప్రవేశించిన ఆత్మలు, తమకు తెలిసినదాని కంటే యిక్కడ ఎంతో మార్పు ఉన్నదని గ్రహిస్తారు. విజ్ఞాన సముపార్జనలో ముందు వుండటం వలన, ఈ ఆత్మలు తమ అభిప్రాయాలను ప్రజలకు తక్కువ శ్రమతో తెలియజేయగల్గుతున్నారు. కొంతకాలం వరకూ ఈ ఏర్పాటు బాగా పని చేసింది. కాలక్రమేణా రెండు - మూడు వివేక క్షేత్ర ఆత్మలు ఒకే చోట పని చెయ్యటం వలన వారిలో పోటీలు ఏర్పడి, స్వార్ధం చిగురించింది. అసామాన్యమైన తెలివి ఉండటం వలన, ఆధిపత్యాన్ని కోరుకున్నారు. ఈ ఆట చాలా ఆసక్తిగా ఉందని గ్రహించారు. ఈ లోకంలో వారు ఎన్నో సృష్టించారు కానీ ఎవరైనా తాము సృష్టించినది అన్నింటికన్నా ఉత్తమమైనదని తలచిన వెనువెంటనే వేరొకరు మరింత ఉన్నతమైన నియమాల్ని సృష్టించగలిగారు! అందువలన, ఈ పోటీ చాలా తీవ్రంగా ఉండి వినోదం కంటే, ఎంతో శ్రమతో కూడుకున్నదిగా ఉంది.

సృష్టికర్త ఈ రెండు క్షేత్రాల ఆత్మలకూ సమాన శక్తులుండేలా సృష్టించాడని వారికి స్పష్టంగా తెలుసు. కానీ స్వచ్ఛంద క్షేత్ర ఆత్మలు వారి స్వయంకృత అపరాధాల వల్ల, ఎంతో అజ్ఞానంతో జీవిస్తున్నాయి. ఈ విధంగా ఉన్నటువంటి స్వచ్ఛంద క్షేత్రంలోని ఆత్మలకు చెడు అవగాహనలు కలుగజేసి, వాస్తవాలను పూర్తిగా చెప్పక

తమ అభీష్టానుసారంగా వారిని ఆడిస్తూ, వివేక క్షేత్ర ఆత్మలు ఆనందిస్తున్నాయి. వాటిని తమ అదుపాజ్ఞలలో వుంచి అత్యంత సుఖాల్నీ, విలాసాలనీ అనుభవిస్తున్నాయి.ఈ ఆత్మలు దేవాలయాలలో, చర్చిలలో, మసీదులలో ఉన్నత పదవులు సంపాదించగలిగాయి.

అయితే, ఈ ఆత్మలు స్వచ్ఛంద క్షేత్రంలో భౌతికంగా మరణించిన వెంటనే కర్మ సిద్ధాంత రూపు రేఖలను పూర్తిగా చూస్తాయి. వారికి విజ్ఞానం, తెలివి తేటలు సమృద్ధిగా ఉండటం వలన తమ తప్పులను గ్రహించి, అంగీకరించి వాటిని సరిదిద్దుకోవాలని కోరుకుంటారు.

అందువలన వారు మరొక్కసారి స్వచ్ఛంద క్షేత్రానికి తిరిగి రావటం ప్రారంభించి, " ఆత్మల మార్పిడి " వలన గ్రహాంతర వాసుల రూపంలో వచ్చి, భూలోకానికి సహాయం చెయ్యాలన్న ధ్యేయంతో ఉన్నారు. ఎక్కువగా ఈ ఆత్మలు, తాము కనుగొన్న వాస్తవాలని తొందరగా తెలియపరచాలని, వారు చెప్పేది నిర్భయంగా, ప్రతిభావంతంగా ఉండటానికి పడమటి దేశాల్లో జన్మ తీసుకోటానికి మొగ్గు చూపుతున్నారు! అక్కడ వున్న సామాజిక, ఆర్థిక వాతావరణ స్థితుల కారణంగా తమ అభిప్రాయాలను తొందరగా విస్తారం చేయటానికి పడమటి దేశాలు చాలా అనుకూలంగా ఉన్నాయి. అందువలన " నవీన యుగ మతం " యొక్క ప్రభావం పడమటి రాజ్యాల్లో ఎక్కువగా ఉండి ప్రపంచమంతా విస్తరిస్తోంది!

"కర్మ సిద్ధాంతం"

'రెండు రకాల క్షేత్రాల' అవసరమేమిటని మీరు ప్రశ్నించవచ్చు. రెండు వర్గాల వారినీ ఒకే క్షేత్రంలో ఉంచటం వలన అర్థం చేసుకునే శక్తి పెరిగి, ఆత్మ పరిణితి త్వరితంగా ఉంటుంది కదా? ప్రారంభంలో రెండు వర్గాల వారికి ఒకే క్షేత్రంలో ఉండటానికి అనుమతినిస్తే వారి ఆలోచనా విధానాలు వేరు, వేరుగా ఉండటం వలన ఒకరినొకరు విదేశీయులుగా భావిస్తారు. ఈ విధమైన అస్తవ్యస్త గందరగోళ పరిస్థితులను నివారించటానికి ప్రారంభంలో రెండు క్షేత్రాలు సృష్టించబడ్డాయి. కానీ యిప్పుడు వారికి తెలియకుండానే ఒక వర్గం వారు వేరే వర్గంతో కలిసి మెలుగుతున్నారు.

మనం కర్మచక్రం లో బందీలుగా ఎందుకు ఉన్నాం? ప్రారంభంలో స్వచ్ఛంద క్షేత్రం అనురాగాన్నీ, దుఃఖాన్నీ మాత్రమే అనుభవిస్తూండేది. ఆ క్షేత్రంలోని వారు ఒకరిపట్లనొకరు ప్రేమాభిమానాలతో మెలుగుతూ, వారి ఆత్మీయులలో ఎవరైనా తమ భౌతిక దేహాన్ని వీడి బంధువులను వీడి వేరేలోకంలోకి వెళ్తున్నప్పుడు ఎంతో దుఃఖపడేవారు. ఒకరిపట్ల ఒకరు బాధ్యతాయుతంగా వ్యవహరించటం వలన, ఎవరైనా దేహాన్ని విడిచినప్పుడు వారి బంధువులను ఓదార్చి వారిని మామూలు స్థితికి తీసుకొచ్చేవారు.

భూలోకంలో అందచందాలు, వనరులు సమృద్ధిగా ఉండటం వలన మెల్ల మెల్లగా ఈ లోకానికి ప్రత్యేకత పెరిగి, ఎక్కువ మంది జీవులు ఆకర్షితులై భూలోకంలో జనాభా పెరగటం మొదలయింది. భూలోక వనరులను, అందాలను, పంచుకుంటూ, కలిపి జీవించటం

కాకుండా తమ "స్వంతం చేసుకోవా" లన్న భావం వారిలో చిగురించింది. మొట్టమొదట ఈ భావం తమ ప్రేమను పంచుకున్న బంధువులు ఆకలితో అలమటించ కూడదని వారిని రక్షించేందుకు మాత్రమే ప్రారంభమైంది; కానీ, కొంత కాలానికి వారిలో ' అత్యాశ ' పెరిగింది. ఆ అత్యాశ వారిలో అసూయ, ఆగ్రహం, భయం, నిరుత్సాహం, స్వార్ధం, క్రౌర్యం అన్నవాటికి దారి తీసింది. ఈ దోషాలన్నింటికీ మూల కారణం వాంఛలు కలిగి వుండటమే! అందువలన వాంఛల కతీతంగా ఉన్నట్లయితే, పై దోషాల నుండి విముక్తులై స్వేచ్ఛగా జీవించగలం.

కానీ వీరు ఈ ప్రాపంచిక వ్యవహారాలలో ఎంత లోతుగా నిమగ్నులైనారంటే తమ కోరికలను సంపూర్ణంగా తృప్తి పరచే విధంగా తమను తాము సమర్ధించుకుంటున్నారు. అందువలన వాంఛల మూలంగా వీరు బందీలవటం ప్రారంభమైంది. వాంఛల వలన, ఆత్మ ప్రగతికి అత్యంత బద్ధశత్రువైన 'భయం' ఉత్పన్నమవుతుంది.

ఈ భయాన్ని ఎవ్వరూ ఎప్పుడూ సరిగ్గా అర్ధం చేసుకోలేక పోయారు. ప్రతి చర్యా మానవుడికి ఈ ' భయం ' అన్న దానితో సంబంధాన్ని ఏర్పరుస్తుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి అపారమైన ధన సంపత్తి కలిగి వున్నప్పటికీ, తన పూర్ణ సమయాన్ని మరింత సంపాదించటానికే ఎందుకు వెచ్చిస్తున్నాడు? దానికి కారణమేమిటి? ఐశ్వర్యమనేది శాశ్వతం గా తన వద్ద వుండదని తలుస్తూ, దురదృష్టవశాత్తు దానిని కోల్పోతానేమోనని ఆలోచిస్తూంటాడు. ఈ విధంగా భవిష్యత్తులో తన సంపదను కోల్పోతానన్న భయంతో

వర్తమానాన్ని మరచి, ' ఒక ఎద్దు ' లా గా బండ చాకిరీ చేస్తూ, ధన సముపార్జనే తన ముఖ్య ధ్యేయం గా చేసుకుని మరింత సంపదని కూడ బెడుతూంటాడు.

ప్రేమించి పెళ్ళి చేసుకున్న యువతీ యువకులు, తమ వైవాహిక జీవితారంభంలో కలిగిన సాన్నిహిత్యానికీ, ఆప్యాయతకీ తమ తదుపరి జీవితంలో దూరమై, ఎందువలన కొట్లాటకు దిగుతారు? స్త్రీ ప్రారంభదశలో తన భర్త సాన్నిధ్యంలో మరింత ఆప్యాయతనీ, మరింత సుఖాన్నీ పొందిన తరువాత నెమ్మది నెమ్మదిగా " భర్త అదే ప్రేమని జీవితాంతం వరకూ కొనసాగిస్తాడో లేదో " నని భయపడుతుంది. " పిల్లల్ని జీవితాంతం జాగ్రత్తగా చూసుకుంటాడా? కాలక్రమేణా తాను అందాన్నీ, ఆకర్షణనీ కోల్పోయిన తరువాత కూడా తన ప్రేమకు విలువనిస్తాడా? " - ఈ విధంగా ఎన్నో భయాలు ఆమెలో చోటు చేసుకుంటాయి. అందువలన భర్తను తన ఆధీనంలో వుంచుకోవటానికి ఆజ్ఞలు జారీ చేస్తూ, విమర్శిస్తూ ఉంటుంది.

ప్రేమని ఆజ్ఞల వలన పొందలేరు. ఆ భార్య ఈ చిన్న సత్యాన్ని మరచిపోతుంది. భర్త ఆమె భయాల్ని దూరం చేయకపోగా పురుషాహంభావంతో ఘర్షణలోకి దిగటం వలన కర్మ బంధాలకు లోనవుతాడు. భార్యాభర్తలు ఒకరినొకరు అర్ధం చేసుకోవటానికీ, ప్రేమించటానికీ, సుఖాలను ఎలా పంచుకోవాలన్న పాఠాలు నేర్చుకోవటానికీ, తమ తమ పూర్వ జ్ఞాపకాలను కోల్పోయి భూలోకం లో మళ్ళీ మళ్ళీ జన్మ తీసుకుంటారు.

ఒకే విధమైన సందర్భాలను వివిధ ప్రదేశాల్లో, వేరుగా కొంత రంగు జతపరచబడి వారు ఎదుర్కోన వలసి వుంటుంది. వారిరువురూ ఒకరినొకరు సరిగ్గా అర్ధం చేసుకోనంత వరకు ఈ కర్మచక్రం కొనసాగుతూనేవుంటుంది. వారి మధ్య అవగాహనను సరి చేసుకున్న వెనువెంటనే వారు యితర అనుభవాల కొరకు తయారవుతారు.

అందువలన, మీరు తెలుసుకోవలసిన దేమంటే ప్రతి సంఘటన, ప్రతి బాంధవ్యం, ప్రతి పరిష్కారం యొక్క ఉద్దేశ్యం మీరు పాఠాలను నేర్చుకోవటానికే!

అందువలన పరిస్థితుల ప్రభావంలో కొట్టుకుపోకుండా, విశ్లేషించటానికి ప్రయత్నించాలి. వాటిని విశ్లేషిస్తున్నప్పుడు ఏ వైపూ మొగ్గుచూపక, నిజమైన న్యాయనిర్ణేత గా వ్యవహరించాలి. ఈ విధంగా చెయ్యటం వలన ఒకే జీవిత సమయంలో ఎంతో నేర్చుకుని, మీ కర్మ బంధాలను అతి తక్కువ సమయంలో రూపు మాపుకోగల్గుతారు.

మీరు మీ జీవితంలో ప్రతి ఒక్క స్వభావాన్నీ విశ్లేషించనవసరం లేదు. మీలో ఉన్న ప్రగతి నిరోధకాలైన ' భయం ', ' స్వార్ధం ', ' దురాశ ', ' అసూయ ' లకు ముఖ్య కారణం మీకున్న వాంఛలే. అందువలన, మీరు మీ కోర్కెల్ని అదుపులో ఉంచుకోవటం వలన అంతా సక్రమంగా జరుగుతుంది. ఈ వాంఛలనేవి శత్రువులై మిమ్మల్ని సత్యకర్మలో బందీలుగా చేస్తున్నాయి.

మరొక విషయం గురించి మీరు జాగ్రత్త వహించ వలసిందేమంటే ' ఆవేశం '! గాఢావేశాలు హద్దు మీరటం వలన స్వంతం చేసుకోవాలన్న కోర్కె జనిస్తుంది. భౌతిక వస్తువులను పొందాలన్నది కోరికల మూలంగా వస్తుంది. కాబట్టి ఈ విషయం ఇక్కడ విడిచి పెడదాం.

వేరొక వ్యక్తిని పొందాలనుకోవటం చాలా ప్రమాదకరమైనది! చాలా మంది వారి భార్యా పిల్లలు తమ స్వంతమని తలుస్తారు! తాము చెప్పిందే వారందరూ వినాలని ఆశిస్తారు! వారిని స్వతంత్ర జీవితం కల్గిన వ్యక్తులుగా పరిగణించరు! అజ్ఞానం వలన యాజమాన్యత్వాన్ని గాఢమైన ప్రేమగా తలుస్తారు!

ఈ విధమైనటువంటి భావోద్రేక పూరితమైన ప్రేమ వలన ఎక్కువ మంది ఎక్కువ సమయాల్లో ఎన్నో అవాంఛనీయ చర్యలను చేస్తూ ' కర్మ ' లకు లోనవుతారు. ఉదాహరణకు ఒక వ్యక్తి తన భార్యను గాఢంగా ప్రేమిస్తున్నానని చెబుతూ ఆమె కోసం, ఆమె అవసరాలను తీర్చటం కోసం, ఆమె సౌఖ్యం కోసం ఎక్కువగా సంపాదించాలని కోరుకుంటాడు. సంపాదన మీద వ్యామోహం లేనప్పటికీ తన భార్యను తృప్తి పరచాలనే కోరికతో అక్రమంగా సంపాదిస్తూ ఆమెకు సుఖాన్ని చేకూర్చాలనుకుంటాడు. ఉద్రేకంతో కూడిన వ్యామోహం పేరుతో తన చర్యలను సమర్ధించుకుంటాడు.

ఆ వ్యక్తికి ' పవిత్ర ప్రేమ ' యొక్క అర్ధం తెలియదు. పవిత్ర

ప్రేమ ఎప్పుడూ దేనినీ కోరదు! తన భార్యకు నిజమైన ప్రేమ నందించగల్గితే ఆమె వేరేదేమీ కోరదు! ఆమె అతనితో సహకరిస్తూ తనకు పవిత్ర ప్రేమ, ఆప్యాయత మాత్రమే కావాలని కోరుకుంటుంది! అందువలన మీ భార్యా బిడ్డలపై కాల్పనిక ప్రేమతో మిమ్మల్ని మీరు మోసం చేసుకోవద్దు.

రెండవ విషయం ఏమిటంటే తల్లిదండ్రులు, వారి పిల్లలు పెద్దవారయినప్పటికీ తమ సలహాలే పాటించాలన్న విషయానికి ప్రాధాన్యతనిస్తారు. ఈ విధంగా వ్యవహరించటం వలన, తమ పిల్లలు అనుభవంతో నేర్చుకోవలసిన పాఠాలకి అడ్డు పడుతూండటం వలన, వారు పయనించే బాటలో అవరోధాలవుతారు.

నిస్సందేహంగా ప్రతి వ్యక్తీ తన వృద్ధ తల్లిదండ్రుల పట్ల బాధ్యత కలిగి ఉండాలి. కానీ కేవలం వారికి మర్యాద నివ్వటం కోసం వారు ఇచ్చే అసమంజసమైన సలహాలను పాటించనవసరం లేదు. ప్రతి వ్యక్తి యొక్క ధర్మమేమిటంటే తమ వృద్ధ తల్లిదండ్రులు జీవితాన్ని అర్థం చేసుకునేటట్లు చూడాలి. ఇది క్లిష్టమైన పని అయినప్పటికీ అసాధ్యం కాదు.

అందువలన మీరు మీ బంధువులను ప్రేమించండి. కానీ ఎవ్వరినీ మీ సొత్తుగా భావించవద్దు. వారికి స్వాతంత్ర్యాన్ని యివ్వండి. వారి మాటలకు విలువనివ్వండి. వారి ఆలోచనలకు విలువనివ్వండి. మంచిని గ్రహించండి. తప్పుల్ని సరిదిద్దండి. వాదనలకు త్రోవ యివ్వద్దు. అన్నీ

చర్చించండి. ప్రేమ నిండిన హృదయంతో బాహాటంగా చర్చించండి. ఎప్పుడైతే మీరు మనస్సు విప్పి ఒక వ్యక్తితో మాట్లాడగలరో అప్పుడే అన్ని సమస్యలనూ, సర్వ అపార్థాలనూ పారద్రోలగలరు.

ఎక్కువ కుటుంబాల్లో తరచుగా ఘర్షణలను ఎందుకు చవిచూస్తున్నారు? అవగాహనా లోపాలే ఘర్షణలకు కారణభూతమవుతున్నాయి. మీ సన్నిహితులలో ఎవరైనా అజ్ఞానంతో వాస్తవాల్ని సరిగ్గా అర్థం చేసుకోకపోతే మీరు అతని స్థాయికి దిగి, మీ అభిప్రాయాలు నెగ్గటం కోసం అతనితో పోరాడకండి. దానికి ప్రేమ, జాలి చూపండి. అతను మీ స్థాయికి ఎదగలేదని గుర్తు తెచ్చుకోండి. నిదానంగా అతనిని మీ స్థాయికి ఎదిగేటట్లు ప్రయత్నించండి. అప్పుడు అతను తన తప్పును గ్రహిస్తాడు.

మీతో చాలా మంది ఏ విధంగా చెబుతారంటే, - " వేగంతో సాగే ప్రస్తుత జీవిత కాలంలో ఈ విషయాలన్నీ సహనంతో వివరించేందుకు సమయం ఎక్కడిది? " మీ అభిప్రాయాలను అదే పనిగా అవతల వారికి ' సుత్తి ' లాగా కొట్టనవసరంలేదు! మీ జ్ఞాన పరిధిలో, మీ స్వానుభవంతో ఈ విధానం సరియైనదని వారికి తెలిపితే చాలు. మీరు చెప్పే విషయంలో సత్యముండవచ్చు కానీ వేరు విధానంలో ప్రయత్నించి ఏం జరుగుతుందో చూడండి. నిష్పక్షపాతంగా వ్యవహరించటం వలన, నిజాయితీగా ప్రయత్నించటం వలన, అది ఎన్నో వింతలకు దారి తీయవచ్చు.

వాస్తవంగా చెప్పాలంటే మీలో ఎంతో మంది ఊహించిన దానికంటే ఎక్కువ సమయాన్ని వృధా చేసుకుంటున్నారు. సమయం కంటే ఉద్దేశ్యం లోపించిందని తెలుసుకోండి. మీ పరస్పర సంబంధాలలో అనవసరమైన కాలక్షేపణ కంటే ప్రేమను కలిగి వుండటం, అర్ధం చేసుకోవటం అనే విషయాలు చాలా విలువైనవని గ్రహించాలి. స్వార్ధపూరితమై ఉండటం వలన, మీరు మీ మీ బాధ్యతల నుండి తప్పించుకోటానికి, వినోదాలని ఆశ్రయించి, మీ " మనశ్శాంతి కోసం వినోదం అవసరం " అన్న తప్పుడు నెపాలకి తావిస్తున్నారు.

మీలో ఎక్కువ మంది సమస్యలకు పరిష్కారాన్ని కోరక నాటిని లాగి పొడిగించాలని కోరుకుంటున్నారు. ఆ సమస్యలతో కొంత సుఖాన్ని అనుభవిస్తున్నారు. అందు వలన యిటువంటి దృక్పధం నుంచి బయట పడండి. మీరు ఈ జీవితంలో ఎన్నుకున్న సమస్యలను **పరిష్కరించుకోకపోతే యివే సందర్భాలను రెట్టింపు తీవ్రతతో తరువాత జన్మలలో ఎదుర్కొన వలసి వస్తుంది.**

కర్మబంధాలలో యిరికిచ్చే మరొక విషయమేమిటంటే ' పేరు ప్రఖ్యాతులు '. ఈ విధమైనటువంటి కీర్తి 'నిత్యకర్మ' కంటే ' సత్యకర్మ' తో ఎక్కువ సంబంధం కలిగి వుంది.

ఎక్కువ పరిణామంలో మంచి కర్మ ఉండటం వలన, మీరు సంఘంలో ఒక వున్నత స్థానాన్ని చేరటమే కాక, అది విశ్వంలో యితర

ప్రాణికోటికి సహాయకారిగా ఉండటానికీ తోడ్పడుతుంది. కానీ, పేరు ప్రఖ్యాతులనేవి ఎంతో ప్రమాదకరంగా, మామూలు సుఖాలు కంటే ఎంతో ప్రభావంతంగా ఉంటాయి. ఈ కీర్తిని మానవుడు ఒక్కసారి చవి చూసాడంటే దానినే శాశ్వతంగా పొందాలని కోరుకుంటాడు. యితరుల సుఖశాంతులకి అంకితమవ్వాలనే సత్యమైన అర్పిత భావం ఉంటే మీరు చేరుకున్న స్థాయి, పొందిన కీర్తి దానంతట అదే మీతో ఉండిపోతుంది.

కానీ, ఒకసారి మీరు కీర్తి ప్రతిష్టలకు సంబంధించిన అత్యున్నతమైన స్థానాన్ని పొందారంటే వాటిని పోగొట్టుకోవటానికి యిష్టపడరు. పర్యవసానం - అన్ని విధానాల్నీ - మంచివైనా, చెడ్డవైనా, క్రూరంగా వున్నా - వాటిని అంటి పెట్టుకుని మీ స్థానానికి రక్షణ కల్పించుకుంటారు. ఈ విధంగా చేయటం వలన, మీరు ఎక్కువ కర్మని సంపాదించటమే కాకుండా మీ నిర్ణయాల మూలంగా యితరుల ప్రగతికి అడ్డుగా నిలవటం వలన కర్మ చక్ర ప్రభావానికి తీవ్రంగా గురి కావల్సి ఉంటుంది. యిటువంటి పరిస్థితుల నుంచి బయటపడాలంటే, ఒకసారి ఎంతో పేరు ప్రతిష్ఠలని, అనుచరులని పొందగల్గిన, మంచిస్థానానికి ఎదిగిన తరువాత మీ స్థాయిని కోల్పోతారని దిగులు పడకుండా ఎల్లప్పుడూ సత్యమార్గాన్నే అనుసరించాలి.

ఒకవేళ మంచి కోసం, సత్యం కోసం, మీ స్థానాన్ని త్యాగం చేయాల్సి వస్తే ఒక్క నిమిషం కూడా తటపటాయించకుండా ఆ స్థాయిని

కోల్పోవటానికి సంసిద్ధంగా ఉండాలి. ఆధ్యాత్మిక మార్గంలో ఉన్నవారికి కూడా యిదే వర్తిస్తుంది. మీ యొక్క పరిశ్రమ వలన, మంచి కర్మ వలన కొంత జ్ఞానం పొందినట్లయితే దానిని యితరులకు ప్రేమతో బోధించాలే కానీ కీర్తి కోసం ప్రాకులాడకూడదు. ఒక్కసారి పేరు ప్రతిష్టల బంధాలలో పడ్డారంటే అప్పుడు మీరు ఎన్నో హాని కలిగించే పనులు చేస్తూ , యితరులనూ అజ్ఞానంలో తప్పుడు అవగాహనలతో నడిపించినవారవుతారు. యిటువంటి కర్మకు దూరంగా ఉండాలంటే ఎల్లప్పుడూ మీరు సత్యాన్నే పలుకుతూ ఏ విషయాన్నైతే మీరు ప్రభోధిస్తున్నారో దానినే మీరు ఆచరిస్తూండాలి.

ఎంతో మంది సాధువులు, మత గురువులు ఏ విషయంలోనైనా అద్భుతంగా ఉపన్యాసాలిస్తారు. అది పరిపూర్ణ సత్యమే కానీ వారు తాము బోధించిన దానిని అనుసరించటం లేదు. ఈ వ్యక్తులు ప్రజలకు మంచినందించటం వలన తమ ఆధ్యాత్మిక జీవితంలో ఎంతో లబ్ది పొందుతున్నామని తలుస్తారు. వాస్తవంగా జరిగేదేమంటే అనుచరులు తమ గురువు ప్రభోధించింది, గురువే పాటించటం లేదని తెలుసుకున్నట్లయితే, వారు కొంత చొరవ తీసుకుని వారనుసరించే మార్గం యొక్క పరిధులు దాటుతూ తమ గురువే తాను చెప్పిన మార్గాన్ని అనుసరించటం లేదు కదా మనం ఆయన ప్రభోధించింది అనుసరించవలసిన అవసరమేమిటని సమర్థించుకుంటారు.

ఈ విధంగా గురువులు తమ అప్రవర్తన వలన, ప్రజలు తప్పుడు

పనులు చేయటానికి ప్రోత్సాహిన్నిస్తున్నారు. ప్రభోధనలు చేయటం చాలా సుళువు. ప్రజలకు ఎన్నో సలహాలనివ్వచ్చు. సలహాలిచ్చే ముందు మీరు మీ బోధనల్ని, సలహాలని పాటించటానికి ప్రయత్నించాలి. మీ జీవితమే ప్రజలకు ఒక ఆదర్శ ఉదాహరణగా నిలచి వారిని సత్యమార్గంలోకి నడిపించే విధంగా ఉండాలి. ఎప్పుడైతే మీ సిద్ధాంత పరమైన జ్ఞానాన్ని దైనందిక జీవితంలో ఆచరణలోకి తెస్తారో అప్పుడు మీ జీవితమే ప్రశ్నించటానికలవి కాని ఒక సిద్ధాంతం గా, ఒక భగవద్గీత గా, ఒక ఖురాను గా, ఒక బైబిలు గా మారుతుంది. అందు వలన ఉద్దేశ్యపూర్వకంగా ఎప్పుడూ కూడా కీర్తి కోసం ప్రాకులాడవద్దు.

**కర్మచక్ర సిద్ధాంతం అంటే ఏమిటి?**

యిది చాలా సుళువైనది. దేనినైతే మీరు నాటుతారో దానినను సరించి మీకు ప్రతిఫలం ఉంటుంది. వేప విత్తనం నాటి మామిడి పండ్ల నాశిస్తే అవి వస్తాయా?

కర్మసూత్రానికి కూడా అదే వర్తిస్తుంది. బాహ్యా అంతర అత్యున్నతమైన స్మృతులు మీ మనస్సులో వుండి మీకు సహాయం చేస్తే మార్గదర్శన మిస్తూ మిమ్మల్ని మీ విజయ వేదిక వద్దకు తీసుకుని వెళ్తాయి. నిజానికి లోపించిందేమంటే మీలో మీకున్న సంకల్ప బలం! అందువలన మన ఓటమికీ, మనం చేసే చెడుకార్యాలకీ, మన దురదృష్టానికీ యితరులు బాధ్యులని ఆరోపణ చేయలేము. ఎప్పుడైతే మీరు ఎదుర్కొనే ప్రతి సంఘటనా కొంత స్వానుభవం కోసం కర్మ తీర్చుకోవటానికి స్వయంగా నిర్ణయించుకున్న పథకం ప్రకారం

జరుగుతున్నదని గ్రహిస్తారో అప్పుడే నిశితంగా ఆలోచించే మనస్సు కలిగి ఉంటారు.

ఎటువంటి చెడు ఆలోచనలైనా, చర్యలైనా కొంత కర్మ కూడటానికి కారణభూతమవుతాయి. దానిని సమాప్తం చేసుకోటానికి కొన్ని మంచి పనులు చేయాలి, లేదా యితరులకు ఏవిధమైనటువంటి హాని కలిగించే ఆలోచనలు చేస్తారో దానికి తత్సమానమైన చిత్రహింసలనుభవించినప్పుడే మీ చెడుకర్మ శూన్యానికి చేరుతుంది.

మీరు చేసిన చెడు కార్యాలను, కర్మనిల్వను తెలుసుకోవటానికి ఆకాశిక్ రికార్డుల రూపంలో మార్గదర్శకత్వం లభిస్తుంది. ఎవరైనా తమ భౌతిక జీవితంలో ఆకాశిక్ రికార్డులను చదవటం నేర్చుకొనగల్గితే వారికి అమితమైన సాహసం, సదుపాయం కలిగి తమ కర్మ ఋణాన్ని తేలికగా తీర్చుకోవటానికి అవకాశం ఉంటుంది.

కర్మసూత్రాన్ని అర్థం చేసుకోటానికీ, దాని నతిక్రమించటానికీ ప్రతి ఒక్కరికీ దాని గురించి కొంత జ్ఞానం కలిగి ఉండాలి. మనం చేసే ప్రతి చర్యకూ తత్ సమానమైన ప్రతిచర్య ఒకటి వుంటుందని అనుక్షణం తలచుకుంటే - మనం చేసే ప్రతి మంచి చెడు చర్యలకు అనుగుణంగా ప్రతిఫలం కలుగుతుందని నిరంతరం తలచుకుంటే - మన కర్మ శేషాన్ని విశేషంగా తగ్గించుకోవచ్చు.

అందరి మనస్సులో వున్న ఒక పెద్ద ప్రశ్న ఏమిటంటే "ఒక చర్య

మూలంగా ఉద్దేశ్యరహితంగా జరిగిన హాని, ఉద్దేశ్యపూర్వకంగా చేసిన చర్య యొక్క కర్మకు సమానంగా ఉంటుందా లేదా?"

**ఆలోచన ద్వారా లేక చర్య ద్వారా హాని కలిగించే ఉద్దేశ్యం ఏదీ లేకపోతే మీకు ' కర్మ ' అంటదు!**

కానీ " ఉద్దేశ్యరహిత " మనే పదాన్ని మీరు బాగా అర్థం చేసుకోవాలి. ఉదాహరణకి మీరు ఒక పని చెయ్యటం వలన ఎవ్వరికీ హాని కలుగకుండా మీకే కాకుండా యితరులకూ కూడా లాభం చేకూరుతుందని తెలిసి చేసారనుకుందాం. కానీ మీరు పని చేస్తున్నప్పుడు కొంత మందికి హాని కలగవచ్చని తెలుసుకున్నట్లైతే వేరే పద్ధతి ద్వారా ఆ పనిని చేసి యితరులకు హాని కలుగకుండా చూడండి. మీరు చేస్తున్న పని మూలంగా సంతృప్తి చెందారు - కానీ ఆ పని పూర్తయిన తరువాత మీరు చేసిన పని వల్ల అన్ని జాగ్రత్తలూ తీసుకున్నప్పటికీ హాని కలిగిందని తెలుసుకుంటారు. యిప్పుడు మీరు కర్మ గురించి బాధపడవద్దు. దానికి బదులుగా మీ చర్య వల్ల బాధకు గురైన వారి వద్దకు వెళ్ళి మీ పరిస్థితిని వివరించండి. ఉద్దేశ్యరహితంగా జరగటం వలన వారు మిమ్మల్ని క్షమించేలా మీ వీలైనంతవరకు వారికి తగిన సహాయం చెయ్యండి.

ఒకవేళ ఆ వ్యక్తికి కొన్ని బలమైన కారణాలవల్ల మీరు సహాయాన్ని అందించలేకపోయినా, మీరు కర్మని కూడగట్టుకుంటారని మాత్రం

తలచవద్దు. ఉద్దేశ్యరహితంగా జరిగినటువంటి హాని పట్ల మీరు హృదయపూర్వకంగా బాధపడినట్లయితే ఆ కర్మ మీకు వర్తించదు. బాధితులకు కల్గిన నష్టాన్ని పూరించుకోటానికి మీరు వారి కోసం ప్రార్ధన చేసినట్లయితే మరీ మంచిది. అందువలన కర్మ సంక్రమిస్తుందని మీరు అనవసరంగా బాధపడవద్దు.

యిక్కడ మరొక విషయం కూడా గట్టిగా చెప్పాలి. ఒక పని చెయ్యటం మూలంగా ఎంతో లబ్ది పొందుతారన్న భావంతో, అంకిత భావంతో మీరు పని చేస్తున్నప్పుడు, ఎవరో వచ్చి మీరు నిజాయితీతో చేస్తున్న పని మూలంగా అతను నష్టపోయాడని చెబుతాడనుకుందాం. ఈ సందర్భంలో ఆ వ్యక్తి యొక్క ఉద్దేశ్యమేమిటో మీరు తెలుసుకోవాలి. ఒకవేళ తన స్వలాభం కోసం ఆ పనిని ఆపమన్నట్లయితే మీరు మీ పనితో ముందుకు సాగవచ్చు. అతను నిజంగా నష్టపడినట్లయితే మీరు మీ పనిని సమర్ధవంతంగా చేస్తూ ఆ వ్యక్తికి కలిగిన నష్టాన్ని కూడా పూరించాలి.

ఎవరైనా చెడు భావంతో మీ పనికి అడ్డు తగిలినట్లయితే మీరు దానిని సహించవద్దు. మీకెంత ధైర్యం ఉండాలంటే ఆ చెడును సవాలు చేస్తూ మీ పనికి అడ్డం రాకుండా చేసుకుంటూ, అందరి జీవితాలకీ సంబంధించిన మంచి పనిని చేస్తూ ముందుకు సాగాలి.

ఏమీ ఆశించకుండా, మంచి పనులు చేస్తూ, మంచి ప్రభోధనలు

చెయ్యటం వలన మీ కర్మ తుడిచిపెట్టుకు పోతుంది! చెడు నుండి మంచిని కాపాడినప్పుడు కూడా మీ కర్మ తుడిచి పెట్టుకుపోతుంది! అదే విధంగా మీ కళ్ళ ఎదుట ఏదైనా చెడు జరుగుతున్నప్పుడు మీరు దానిని ఆపటానికి ప్రయత్నం చెయ్యకపోతే, మీకు కర్మ చుట్టుకుంటుంది! ఈ సందర్భంలో చాలా మందికి అనేక సందేహాలు రావచ్చు. అందుకని వివరంగా చెప్పుకుందాం.

ఒక వ్యక్తి వేరొకరిని కొట్టాలని, హాని పరచాలని లేదా చంపాలనుకున్నట్లయితే, మీరు కర్మ విషయంలో ఎటువంటి అవగాహన కలిగి ఉండాలి?

కొందరు అనేదేమంటే, హానికి గురైన వ్యక్తి గతంలో హాని చేసిన వ్యక్తికి ఏదో చెడు చేయటం వలన ఆ వ్యక్తి ఈ పనికి తలపడ్డాడనీ, అందువలన " మన మెందుకు కల్పించుకోవాలి? మనం వారి కర్మకు ఎందుకు అడ్డు తగలాలి? " అని వాదిస్తారు. లేదు! మీరు వారి కర్మకి అడ్డుపడటం లేదు! మొట్టమొదటగా, ఈ చెడు సంఘటన జరగటం వలన కొత్త కర్మకు దారి తీస్తుందా లేదా యిది కర్మ చక్ర విధానంలో ఒక భాగమేమోనన్న విషయం మీకు తెలియదు.

ఏ విధంగా అయినప్పటికీ ఆ వ్యక్తి కొంత ఆవేశం వలన చెడు తలపెట్టటం మూలంగా అతనిని ఆపటానికి మీకు హక్కు వుంది. ఈ విధంగా వ్యవహరించటం వలన ఆ వ్యక్తికి కొత్త కర్మ

సంక్రమించకుండా కాపాడిన వారవుతారు. ఆ వ్యక్తిని హాని చెయ్యానిస్తే ఈ చర్య వలన ఎవరో ఒకరు తెలివి తెచ్చుకునేటంత వరకూ యిదే సంఘటన మళ్ళీ మళ్ళీ జరగవచ్చు. వారు తమ తప్పును తెలుసుకునేటప్పటికి, కొన్ని వందల జన్మలు వృధాగా గడుపుతారు. మీరు కల్పించుకోవటం వలన ఆ కర్మచక్రాన్ని ఆపిన వారవుతారు.

బాధితుడి విషయం కూడా పరిశీలించినట్లయితే, తన గత జన్మలో కూడా యిదే విధమైన చర్య చేసినట్లయితే, తన కర్మను సరిదిద్దుకోవటానికి, అటువంటి సంఘటననే ఎన్నుకున్నట్లైతే మీరు కల్పించుకోవటం వలన అతనికి మరి కొంత కాలం గడపటానికి అవకాశం వచ్చి ఆ కాలంలో మరి కొంత కర్మ రుణాన్ని తీర్చుకోగల్గటమే కాకుండా మరికొంత కాలం జీవించటం వలన మరింత జ్ఞానవంతుడవటానికి అవకాశముంటుంది. ఎప్పుడైతే జ్ఞానవంతుడవుతాడో తన కర్మని సరిచేసుకోవటానికి గతంలో చేసినటువంటి చెడు చర్య మళ్ళీ చెయ్యనవసరం లేకుండా, ఒక మంచి కార్యాన్ని చెయ్యవచ్చు. భూలోకంలో మన దైనందిక జీవితంలో చెడు కర్మని సరిదిద్దుకోటానికి ఎన్నో అవకాశాలు వస్తాయి. ఎన్నో అనుభవాలు ఎదురవుతాయి. మరింత జ్ఞానాన్ని సంపాదించవచ్చు. మరింత ప్రేమను పంచుకోవచ్చు.

అంతే కాకుండా ఒక వ్యక్తి హానిని తలపెట్టేటప్పుడు సరైన సమయంలో మనం అడ్డగించినట్లయితే, అతని ఆవేశాన్ని అతిక్రమించటానికి సహాయపడిన వారమవుతాము. చాలా మంది

ప్రజలు తమ ఆవేశం కట్టలు త్రెంచుకున్నప్పుడే ఒక చెడు పనిని చెయ్యటానికి పూనుకుంటారు. ఒక్కసారి ఆ క్షణం గడిచినట్లయితే వారు చేసిన పనికి బాధపడతారు. అందువలన మీరు యిద్దరికీ సహాయం చేసిన వారవుతారు. అంతే కాకుండా ఒక విధంగా మీరు కూడా కొంత కర్మని తీర్చుకున్నవారవుతారు.

మొదట మీరందరూ తెలుసుకోవలసిందేమిటంటే ఈ సమయంలో భూలోకంలో చాలా ' తెలివిగలవారు ' న్నారు. వారిలో చాలా మందికి ' తెలివి ' వున్నప్పటికీ ' జ్ఞానం ' చాలా కొద్ది మందికే వుంది! జ్ఞానం తక్కువ, తెలివి ఎక్కువగా వుండటం వలన, కర్మ సిద్ధాంతాన్ని ఓడించటానికి కొత్త కోణాల నుండి వాదనలు చేస్తారు!

కానీ, వారు తెలుసుకొనవలసిందేమంటే సత్యాన్ని ఎప్పుడు కూడా తెలివితేటలతో అతిక్రమించలేరు. మీరు సత్యాన్వేషకులైతే, సత్యంగా వుండాలనుకున్నట్లైతే, మీకు స్వచ్ఛమైన ' జ్ఞానం ' అవసరం.

యిప్పుడు ఒక ఉదాహరణకి వద్దాం. ఒక ఆడది మానభంగానికి గురైంది. అప్పుడు ఆమె ఏం చెయ్యాలి? ఆమెను ఆ స్థితికి తెచ్చిన వ్యక్తిపై ఎటువంటి చర్య తీసుకోవాలి? ఆమె ఈ సంఘటనతో తన జీవితం అంతమైందనుకోకూడదు. కొంత హాని దురదృష్టవశాత్తు జరిగింది. కానీ ఆమె ఈ పరిస్థితిని అతిక్రమించాలి. ఆమె దుఃఖాన్ని పోగొట్టటానికి అందరూ ప్రోత్సాహమివ్వాలి. ఈ సమయంలో ఆమె

తన పూర్వజన్మ కర్మననుసరించి అటువంటి చర్యే చేసి ఉంటుందా లేదా అన్న విషయాన్ని చర్చించనవసరం లేదు. అటువంటి చర్చ మనకు ఏ విధంగానూ ఉపయోగపడదు.

ఈ సంఘటన ఆమె తన ప్రగతికి ఉపయోగపడుతుందని తలవాలి. " కొంత చెడు జరిగింది; కానీ జరిగిన నష్టాన్ని ఎదుర్కొంటాను; జీవితమంటే ఎన్నో సవాళ్ళను ఎదుర్కొనవలసి వస్తుంది; ఈ సంఘటన్ని నేను ఒక సవాలుగా తీసుకుంటాను; యిదే నా జీవితం యొక్క ' అంతం ' కాదు " - ఈ విధమైనటువంటి ఆలోచనా ధోరణి ఆమె కలిగి వుండాలి.

ఆత్మహత్య ఎంత మాత్రమూ పరిష్కారం కాదు. ఆత్మాభివృద్ధికి ఆత్మహత్య ఎన్నడూ సహాయపడదు. ఒకవేళ ఆమె ఆత్మహత్యకు తలపెడితే యిటువంటి సంఘటననే తరువాతి జన్మలో కూడా నిశ్చితంగా ఎదుర్కొనవలసి ఉంటుంది.

భగవంతుడు మనకీజీవితాన్నిచ్చింది అనుభవాల్ని సంపాదిస్తూ ఆత్మాభివృద్ధి చేసుకోవటానికేగానీ, మన జీవిత కాలాన్ని తగ్గించుకునే హక్కు మనకు ఏ మాత్రమూ లేదు.

ఒక వ్యక్తి తనకు ప్రకృతి సిద్ధమైన మరణం సంభవించేటంత వరకూ తన జీవితాన్ని సంపూర్ణంగా జీవించాలి.

మానసికంగా కృంగినట్లయితే ఆమెకు అందరూ ధైర్యాన్నిచ్చి

ప్రోత్సహించాలి. భూలోకం శాస్త్రీయపరంగా ఎంతో అభివృద్ధి చెందింది. కానీ సామాజిక స్థితిగతులున్నప్పటికీ ఏ వ్యక్తి అయినా ఆమెకు చేయూతనివ్వటానికీ, ఆమెను వివాహం చేసుకోవటానికీ ముందుకు వస్తే అతనిని మెచ్చుకోవాలి. మనం వారికి సహాయం చేస్తూ సంపూర్ణంగా గౌరవాన్నీ, ప్రేమనీ అందించాలి. ఈ విధంగా చెయ్యటం వలన ఆమె తన జీవితంలో గొప్ప విషయాల్ని చూస్తూ, జీవితాన్ని అర్ధం చేసుకుంటూ, తెలుసుకుంటూ, ప్రేమతో జీవితాన్ని కొనసాగిస్తూ తన ఆత్మని అభివృద్ధి చేసుకొనగలదు.

యిప్పుడు నేరం చేసిన వ్యక్తి విషయాని కొద్దాం. అతనిని మనం ఏం చెయ్యాలి. ఈ సంఘటన ఆ వ్యక్తికి సంబంధించిన గత జన్మ కర్మనని వదిలేస్తామా? లేదు! యిప్పుడు మనం గమనించవలసిందేమంటే, " ప్రస్తుత సామాజిక చట్టం అతనికి తన చెడు కర్మని నిర్మూలించటానికి ఏ విధంగా సహాయ పడుతుంది? " అని.

కొన్ని దేశాలలో సామాజిక చట్టాలు చాలా తీవ్రంగా వున్నాయి. మరికొన్ని దేశాలలో చట్టాలు ఆస్తిపరులు తమ ప్రయోజనాలకనుగుణంగా మార్చుకునే విధంగా ఉంటాయి. ఒక వ్యక్తి స్థానికంగా ఉన్న చట్టాన్ననుసరించి, శిక్షననుభవించటం వలన, తన చెడుకర్మను కొంత వరకైనా తగ్గించుకున్నవాడవుతాడు. ఆ వ్యక్తి తన తప్పుని తెలుసుకుని హృదయపూర్వకంగా శిక్షననుభవిస్తూ అటువంటి చర్యని భవిష్యత్తులో

ఎన్నడూ చెయ్యనని మళ్ళీ మళ్ళీ తలపుకు తెచ్చుకున్నప్పుడే ఆ వ్యక్తికి తను కూడగట్టుకున్న చెడు కర్మ కొంత వరకూ తీరుతుంది. శిక్ష విధించారు కనుక దానిననుభవించి, మరింత కక్షతో, ఉద్రేకంతో పగ తీర్చుకోవాలని బయుటకు వచ్చినట్లయితే అతని కర్మరుణాన్ని తీర్చుకోవటానికి ఆ శిక్ష ఏ మాత్రం సహాయపడదు.

సామాజిక చట్టాన్ని ఏ విధంగా తయారు చెయ్యాలంటే, ఒక వ్యక్తి వేరొకరికి హాని కలిగించినట్లయితే, చట్టరీత్యా ఆ వ్యక్తి కష్టపడేలా చేస్తూ తన చెడు కర్మని తొలగించుకునేలా ఉండాలి.

ఉదాహరణకు, ఒక వ్యక్తి వేరొకరితో కొట్లాడినప్పుడు ఆ వ్యక్తి అంగవైకల్యానికి కారకుడైనప్పుడు, అతని మీదే ఆధారపడివున్న బంధువులు, తాము ఏ మాత్రం తప్పుచెయ్యనప్పటికీ బాధకి గురయ్యారు. అందువలన, తప్పుచేసిన వాడు కష్టపడేలా చేసి, ఆ విధంగా సంపాదించిన ధనంతో బాధకు లోనైన కుటుంబీకులకు అందేలా చెయ్యాలి. తన తప్పిదం వలన కలిగిన నష్టాలన్నింటినీ ఆ వ్యక్తి దృష్టిలోకి తీసుకురావాలి. ఈ విధంగా చేసినట్లయితే, తన తప్పు వలన సంక్రమించిన చెడు కర్మలో కొంత భాగాన్ని తగ్గించుకోగలుగుతాడు. తప్పు చేసిన వ్యక్తికి కేవలం కొన్ని సంవత్సరాలు జైలు శిక్ష విధించటం వలన తన తప్పుకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడితే తప్పించి, తన కర్మరుణాన్ని తగ్గించుకోవటానికి ఆ శక్తి ఎంత మాత్రం అతనికి సహాయపడదు.

ఇక తప్పు చేసిన వ్యక్తి వద్దకు తిరిగి వద్దాం. అతనిని స్థానికంగా ఉన్న చట్టానికి అప్పగించాలి. ఈ విధంగా చెయ్యటం వలన అతనికి తన కర్మను తగ్గించుకునే అవకాశాన్ని యిచ్చినట్లు అవుతుంది. ఒక వేళ అతను తన ధనబలంతో లేదా స్థాన బలంతో నిర్దోషిగా నిరూపించుకున్నట్లయితే, తన కర్మరుణాన్ని ద్విగుణీకరించుకున్న వాడవుతాడు. అతను చేసిన తప్పు ద్వారా, నిర్దోషిగా నిరూపించుకోవాలని చేసిన ప్రయత్నం వలన తన కర్మరుణాన్ని మరింత పెంచుకుంటాడు.

ప్రపంచంలో ఎందరో దోషులు స్వేచ్ఛగా తిరగటం వలన ప్రజలకి స్థానిక చట్టం పట్ల నమ్మకం పోయింది. ఎవరైతే స్థానిక చట్టాన్ని ఏర్పరచారో వారు మంచి ఉద్దేశ్యంతోనే తయారు చేసారు. కానీ, విద్యావంతులు, ధనికవర్గాలు దానిని స్వార్ధ ప్రయోజనాల కోసం కొల్లగొట్టారు. అందువలన ఎక్కువ మంది ప్రజలు స్థానిక చట్టం పట్ల తమ విశ్వాసాన్ని కోల్పోయారు. కానీ సమాజాభివృద్ధి కోసం, మనం ఈ స్థానిక చట్టాల్ని సాధ్యమైనంత వరకూ పాటించాలి.

మనం స్థానిక చట్టాల్ని ఎక్కువగా దూషించకూడదు. ఎందువల్లనంటే మనలో ఎక్కువ మంది దానికి సహకరించక పోవటం వల్లనే అది బలహీనంగా తయారవుతోంది. మీరందరూ కలసి పనిచేస్తే దాన్ని శక్తివంతమైనదిగా తయారు చెయ్యవచ్చు. స్థానిక చట్టాన్ని సరిగ్గా అమలు పరచినట్లయితే, ఒక వ్యక్తికి తన తప్పుకు ఈ భూలోకంలోనే చాలా భాగం వరకు కర్మను తీర్చుకోవటానికి అది సహాయపడుతుంది.

ఓ దోషి స్థానిక చట్ట ప్రకారంగా శిక్షననుభవిస్తున్నప్పుడు తాను చేసిన తప్పుకు పశ్చాత్తాప పడకపోతే ఆ తప్పుకు కర్మ రూపంలో శిక్షననుభవించవలసిందే.

వేరొక ఉదాహరణ: ఒక వ్యక్తి నిర్దోషి అయినప్పటికీ, స్థానిక చట్ట ప్రకారం దోషిగా నిరూపించబడి కొంత శిక్షననుభవించాడు. దానికి కారణమేమిటి? అతను ఏ విధంగా ప్రతిచర్య తీసుకోవాలి? ఈ విషయం ఎంతో ఆసక్తిగా ఉండి తెలుసుకోదగ్గ గొప్ప విషయం.

కొన్ని ఆత్మలు మంచి విజ్ఞానం కలిగి వున్నప్పటికీ, భూలోకంలో తమ జీవిత కాలంలో కొంత తప్పు చేస్తారు. భూలోకంలో తమ జీవన కాలం సమాప్తమైన తరువాత, ఆ ఆత్మలు సూక్ష్మలోకాల్లోకి ప్రవేశించి, తమ కర్మ రికార్డులను పరిశీలించుకుంటాయి. వారికి తగినంత జ్ఞానం వుండటం వలన తొందరపడి నిర్ణయాలు తీసుకోరు. దానికి బదులుగా భూలోకంలో తమ కర్మరుణాన్ని తీర్చుకోటానికి ఒక క్షేమకరమైన పథకాన్ని తయారుచేసుకుని, కొత్త కర్మ అంటకుండా చూసుకుంటారు. ఈ ఆత్మలకి కొంత కష్టాలనుభవించాలని తెలుసు. కానీ ఏదో తప్పును సృష్టించుకోవటం వలన కొంత శిక్షననుభవించ వలసి వస్తే, కొత్త కర్మకు దారితీస్తుందన్న విషయం కూడా తెలుసు. అందువలన ఈ ఆత్మలు తాము నిర్దోషులైనప్పటికీ, స్థానిక చట్ట ప్రకారం శిక్షననుభవించటాన్ని కోరుకుంటారు. ఈ విధమైన శిక్షననుభవించవలసిన సమయంలో వారు ధైర్యంతో తమ వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకుంటారు. ఎక్కువ

కారాగారాలలో ఆత్మాభివృద్ధికి తగిన వాతావరణం లేనప్పటికీ, ఒక ఆత్మ తన శక్తిని కూడగట్టుకుని అటువంటి వాతావరణంలో కూడా తన స్వభావాన్ని అభివృద్ధి చేసుకోవాలనుకుంటే, తాను లబ్ధి పొందటమే కాకుండా యితర జీవులకు కూడా వాస్తవాన్ని చవి చూడటానికి సహాయపడుతుంది.

ఈ అమాయకమైన బాధితుడు వేరొక విధంగా కర్మని తీర్చుకోవచ్చు. నిర్దోషి అయినప్పటికీ ఆ వ్యక్తి పై నేరారోపణ జరిగిందనుకుందాం. అతను చట్టబద్ధంగా పోరాడవచ్చు. లేదా చట్టానికి గురికాకుండా ఎటువంటి నేర పథకాన్నీ పన్నకుండా వేరే త్రోవలో కూడా పయనించవచ్చు. తన నిర్దోషిత్వాన్ని సక్రమమైన విధానాన్ని అవలంబించి నిరూపించుకోవచ్చు. ఈ విధంగా కూడా తన కర్మని నిర్మూలించుకోవచ్చు. అతను తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోటానికి కొంత మానసిక వొత్తిడినీ, బాధనీ అనుభవిస్తాడు. కనుక, చెడుకర్మని ఈ విధంగా సరిచేసుకోగలడు. తాను నిర్దోషిగా సక్రమమైన విధానాన్ని అవలంబించి నిరూపించుకున్నప్పుడు మరింత జ్ఞానవంతుడవుతాడు.

మరి కొన్ని ఆత్మలు, స్థానిక చట్టానికి లోనవకుండా యాక్సిడెంట్లకు గురై తమకు తాము శిక్షించుకుంటారు. కొందరు దీర్ఘవ్యాధులు కోరుకుని (జన్మ తీసుకోకముందు) శిక్షననుభవిస్తారు. యివి కూడా కర్మ రుణాన్ని తీర్చుకోవటానికి మార్గాలే. పైన చర్చించిన ఉదాహరణల నుండి కర్మ సూత్రం ఏ విధంగా పనిచేస్తుందో చూడగలిగారు.

కర్మరుణాన్ని తీర్చుకోవటానికి సరైన, సూటిగా వున్న ఫలవంతమయ్యే మార్గం వేరొకటి వుంది. ఈ మార్గం చాలా సులభంగా వుండి ఆచరించటానికి తేలికగా ఉంటుంది. అది ఏ మార్గం? మిమ్మల్ని మీరు శిక్షించుకోకుండా ఎవరైతే కర్మకు లోనై, తీవ్ర శిక్షననుభవిస్తున్నారో, ఎవరికైతే సహాయం కావాలో వారిని ఎన్నుకుని వారికి తగు సహాయం చెయ్యవచ్చు. మీ శక్తినీ, జ్ఞానాన్నీ, ప్రజలు సుఖశాంతులతో వుండటానికి వుపయోగించవచ్చు.

ఈ విధంగా చెయ్యటం వలన, మీరు మీ కర్మని తగ్గించుకున్న వారే కాక, యితరుల ప్రేమానురాగాల గురించి తెలుసుకునేటందుకూ సహాయపడిన వారవుతారు. కానీ మీ ఆలోచనలూ, చర్యలూ స్వార్ధ రహితంగా వుండాలి. ఎప్పుడైతే మీరు యితరుల శాంతి క్షేమాల కోసం శ్రమపడటం ప్రారంభిస్తారో అప్పుడే మీ కర్మరుణాన్ని రెట్టింపు వేగంతో తగ్గించుకుంటారు. కాబట్టి కర్మని పరిపాలించే ముఖ్యమైన సూత్రాలు యివే.

ఈ విధంగా ఉదాహరణపై ఉదాహరణ చర్చించు కోవచ్చు. కానీ విస్తృతంగా తెలుసుకోటానికి యివి చాలు. కర్మ సిద్ధాంతాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోవటానికి ముఖ్యమైనది ' జ్ఞానం '. కర్మ సిద్ధాంతాన్ని మీ 'తెలివితేటల' తో మాత్రమే చూసినట్లయితే దాన్ని పూర్తిగా అర్థం చేసుకోకపోగా దానిలో లోపాల్ని మాత్రమే చూస్తారు. వాస్తవంగా చెప్పాలంటే కర్మ సిద్ధాంతంలో ఏ మాత్రం లోపాలు లేవు. కానీ మీరు

ఎన్నో లోపాల్ని చూడవచ్చు. అందువలన మీరు మీ తెలివితేటలను ప్రక్కన పెట్టండి. లేదా మీ తెలివి ని 'జ్ఞానం' తో కలిపి చూసినట్లయితే వాస్తవమైన అర్థాలని గ్రహించగల్గుతారు.

కొత్త కర్మలను కూడబెట్టుకోకుండా కర్మరుణాన్ని ఏ విధంగా తగ్గించుకోవాలి? ఈ భూలోకంలో నివసించే ప్రతి ఒక్కరూ యిప్పటికే కొన్ని వందల, వేల జన్మలెత్తి ఉన్నారు. అయినప్పటికీ ఎందరో జన్మ రాహిత్యాన్ని చూడలేదు. ఎందువల్ల ఈ విధంగా జరుగుతుంది? మనం మన కర్మ రుణాన్ని తీర్చుకోవటం లేదా? జన్మ తీసుకునే ముందు ప్రతి ఆత్మ రెండు లేదా మూడు కర్మల రుణాన్ని మాత్రమే తీర్చుకోటానికి నిర్ణయించుకుంటుంది. ఏ ఆత్మ కూడా సంపూర్ణంగా ఒకే జీవితంలో తన పరీక్షలన్నింటినీ ఎదుర్కోటానికి సిద్ధపడటం లేదు. అంతే కాకుండా ఒక ఆత్మ తన కర్మరుణాన్ని సంపూర్ణంగా ఒకే జన్మలో తీర్చుకోవటానికి అవకాశం కూడా లేదు.

భూలోక జీవితంలోనే ఎక్కువగా జ్ఞానాన్ని సముపార్జించేటంత వరకూ ఏ ఆత్మ కూడా సంపూర్ణంగా ఒకే జీవితంలో అన్ని పరీక్షలనూ ఎదుర్కోవటానికి సాహసించ లేదు. అందువలన జీవితమంటే ఏమిటో తెలుసుకోటానికి కొంత జ్ఞానాన్ని మీరు సంపాదించుకోవాలి. " మరణమంటే ఏమిటి? " " మరణం తర్వాత ఏం వేచి ఉంది? " " సూక్ష్మలోకంలో సమయాన్ని ఎలా వాడుకోవాలి? " " జ్ఞానం అంటే ఏమిటి? " " దానిని ఎలా సమపార్జించాలి. " " భూలోక జీవితంలోనే

పూర్ణాత్మతో ఎలా అనుసంధానం పొందాలి? " ఈ విధంగా భూలోకంలో ఎంతో నేర్చుకోవాల్సి ఉంది. ఎంతో అర్థం చేసుకోవాల్సి ఉంది.

భూలోకంలో వుండగానే ఈ విషయాలన్నీ నేర్చుకోవాల్సిన అవసరమేమిటని మీకు సందేహం రావచ్చు. " సూక్ష్మలోకాల్లో యివన్నీ వాటంతటవే తెలుస్తాయి కదా? "; " అందువలన ఈ విషయాలన్నింటినీ తెలుసుకోటానికి నేను యింత శ్రమకి ఎందుకు లోనవ్వాలి? ", " అసలు భూలోకంలోనే ఈ విషయాలన్నీ ఎందుకు నేర్చుకోవాలి? " - ఎప్పటి వరకైతే మీరు ఈ విషయాలన్నింటినీ నేర్చుకోరో అప్పటి వరకూ యితర సూక్ష్మలోకాల గురించి మీరు తెలుసుకోలేరు. సూక్ష్మలోకాల్లో ఎక్కువ భాగం స్వచ్ఛందక్షేత్రంలోకే వస్తాయని నేను మొదట్లో చెప్పాను. అందువలన ఎక్కువ జ్ఞానం లేకుండా సూక్ష్మలోకాన్ని చేరుకున్నట్లైతే మీరు భూలోకంలో ఉన్న విధంగానే వుండి మరిన్ని సుఖాలని అనుభవిస్తూ, మరిన్ని కోర్కెలను తీర్చుకుంటూ మీ ఆత్మాభివృద్ధికి ఏ మాత్రం ప్రాముఖ్యత నివ్వరు. జ్ఞానాన్వేషణ అన్నదాన్ని భూలోకంలో వున్నప్పుడే ప్రారంభించి, సూక్ష్మలోకాల్లో వున్నప్పుడు దానిని అభివృద్ధి చేసుకోవాలి.

ఆత్మ పరిణామానికి సహాయపడే అవకాశాల గురించి తెలుసుకోటానికి ఎన్నో మార్గాలున్నాయనటంలో సందేహం లేదు. కానీ, మీరు శిక్షణ పొందటానికి తయారు కావాలి. సూక్ష్మలోకాల్లో పై విషయాలు తెలుసుకోటానికి అవకాశముందన్న విషయం మీరు ఎరుక కలిగి వుండాలి. లేకపోతే భూలోకం కంటే సూక్ష్మలోకం కొంత అభివృద్ధి

చెందినదిగా మరింత సుఖాల్ని, మరిన్ని కోరికలు కలిగిన లోకం మాత్రమే అవుతుంది.

మీరు మరొక్క విషయాన్ని స్పష్టంగా తెలుసుకుని తీరాలి. సూక్ష్మలోకాలు ఎన్నో ఉన్నాయి. ప్రతి లోకమూ దాని క్రింది లోకం కంటే శాస్త్రీయంగా ఎంతో వున్నతమైన ప్రగతిని కలిగి వుంది. కనుక, భూలోకం విడిచిన తర్వాత మీరు ఏ లోకం లోకి ప్రవేశిస్తారన్నది మీ యొక్క జ్ఞాన - విజ్ఞానాలపైన ఆధారపడి వుంటుంది.

మీరు ఎంత వున్నతమైన లోకం చేరుకుంటారో అంత జ్ఞానవంతులవుతారు. సూక్ష్మలోకం యొక్క స్థానం వున్నతమయ్యే కొద్దీ వాంఛలు తరుగుతూ ఉంటాయి. ఊర్ధ్వలోకాలలో జ్ఞాన దాహం ప్రారంభమైన తరువాత, మీకు ఆ లోకాల నుండి మార్గదర్శం, సలహాలు అందుతాయి. అంతేకాకుండా, ఉన్నత సూక్ష్మ లోకాలలో జీవితం మరింత పరిణామం చెందిన, అత్యున్నత స్థాయిని చేరిన ఆత్మల సన్నిధానంలో ఉండటం వలన, అక్కడ వున్న ఆత్మలు కొత్తగా ప్రవేశించిన వారికి, తమకి సాధ్యమైనంత వరకూ సహాయాన్ని అందించటానికి ఎదురు చూస్తూంటాయి. అందువలన, వీలైనంత ఉన్నతమైన లోకానికి చేరుకోవాలన్న ఆశయం మీరు కల్గి ఉండాలి. అందువలన మీరు కొంత ప్రాథమిక జ్ఞానాన్ని సంపాదించుకుని, మంచి కర్మలని పెంపొందించుకోవాలి. అది భూలోకంలో ఉన్నప్పుడే సాధ్యమయ్యే పని.

నిష్పక్షపాతంగా చెప్పాలంటే జ్ఞానాన్ని అభ్యసించటానికీ, అభివృద్ధి చేసుకొనటానికీ తక్కువగా ప్రగతి చెందిన సూక్ష్మలోకాలకంటే, భూలోకంలోనే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

సూక్ష్మలోకాల్లో సంపాదించే జ్ఞానం, సంపద భూలోకంలో జన్మ తీసుకునే ముందు తుడిపి వేయబడతాయి. ఈ సందర్భంలో " తుడిపి వేయబడటం " అనే పదాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలి. సంపాదించిన జ్ఞానాన్ని " సంపూర్ణంగా తీసివేసినట్లు " కాదు. భూలోకంలో మీ యొక్క మూఢ విశ్వాసాల వలన, వాంఛల వలన, మీ ధ్యాసను మరల్చే విధానాల వలన సూక్ష్మ లోకాలలో సంపాదించిన జ్ఞానాన్నీ, అనుభవాలనీ గుర్తుంచుకోలేరు.

ఎప్పుడైతే మీ నిజ స్వరూపాన్ని తెలుసుకోవాలని కోరుకుంటారో, నిజాయితీగా అందుకోసం శ్రమిస్తారో, అప్పుడు సూక్ష్మలోకాల్లో నేర్చుకున్నది జ్ఞప్తికి వచ్చి, తదనంతర పురోగాభివృద్ధికి సహాయాన్ని పొంది, మార్గదర్శం కూడా పొందగల్గుతారు. అందువలన మీరందరూ తెలుసుకోవలసినదేమంటే, మీ ప్రగతి, ఆత్మ పరిణామం భూలోకంలోనే ప్రారంభమై, ఉన్నత సూక్ష్మలోకాల్లో మరింతగా అభివృద్ధి చెందుతుంది.

కర్మచక్రంలో చిక్కుకోకుండా ఉండాలంటే మీరు ఎప్పుడూ మీ ఆలోచనల విషయంలో, చర్చల విషయంలో ఎంతో జాగరూకతను కలిగి ఉండాలి. మంచి ఆలోచనలు పెంపొందించుకోవటం, మంచి పనులు

చేయటం మొదట్లో కష్టతరమనిపించినా మీ మార్గం మరలకుండా ఉండటానికి ఒక్కసారి జాగ్రత్త వహించారంటే, కష్టతరమైనవి కూడా మెల్లమెల్లగా, సులువుగా మారి మీరు మీ ఆలోచనలను, చర్యలను గమనించవలసిన అవసరం తప్పుతుంది. ' జాగ్రత్త ' అన్నది దానంతట అదే అలవాటవుతుంది.

ఎప్పుడైతే సామాన్యం గా, నిజాయితీ గా జీవించటం ప్రారంభిస్తారో అప్పుడు ప్రతి వస్తువూ ప్రేమించదగినది గా, ప్రతి క్షణమూ ఆనందమయంగా వున్నట్లు గుర్తిస్తారు. మీలో ' తప్పు చేసా ' మన్న భావం కలుగదు. మానసిక చిత్రవధ అసలే వుండదు. దానికి బదులుగా ఎప్పుడూ ప్రశాంతమైన మనస్సు కలిగి వుంటారు.

ఎప్పుడైతే మీ ప్రయత్నం వలన మనస్సును ప్రశాంతంగా వుంచగల్గుతారో అప్పుడు స్పష్టంగా, లోతుగా ఆలోచించ గల్గి మీ సమస్యలకు మీరు పొందే సమాధానాలు ఖచ్చితంగా సరియైనవిగా ఉండి, ' కొత్త కర్మ ' కు దూరంగా ఉండ గలుగుతారు. అంతే కాకుండా ఏ రోజైతే మీరు సంపూర్ణమైన సంతోషంతో ఆత్మ సాధనతో గడుపుతారో, ఆ ఒక్క రోజులోనే అసామాన్య పరిమాణంలో కర్మను తుడిచి పెట్టుకోగల్గుతారు. కొంత కాలం గడిచిన తరువాత మీ ఈ జీవిత ముఖ్య ఉద్దేశాన్ని గుర్తించి, దానిని పొందటానికి మీకు ఏదీ అడ్డు తగలదని గ్రహిస్తారు.

అందువలన కొత్త కర్మ సంక్రమించకుండా, మీ కర్మరుణాన్ని తీర్చుకునే అత్యుత్తమమైన మార్గమేమిటంటే, జీవితాన్ని సంతృప్తితో గడపటం, ఏ విషయాన్నైనా నిర్మాణాత్మకంగా ఆలోచించటం.

ఎప్పుడూ మీ ఆలోచనా చర్యల పైన నిఘా వుంచి, ఆత్మ సాధన చేసుకుంటూ, మీలో దాగి వున్న శక్తిని అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూ ఉండాలి. ఎల్లవేళలా ప్రేమ భావన కలిగి వుండి అనుక్షణం ఆనందంతో గడపండి.

పైన చెప్పిన విధంగా అనుసరించినట్లయితే మీ కర్మఋణాన్ని తొందరగా తీర్చుకుని, ఉన్నత లోకాలను చేరి, మరింత ఆత్మోన్నతి కోసం వేచి వున్న పనులని చెయ్యటానికి పూనుకోండి. ముగించే ముందు మీకు నేను సలహా యిచ్చేదేమంటే, యితర లోకాల్లో మీ కోసం వేచి వుండే పనుల గురించి కేంద్రీకరించి యితర లోకాల్లో ఏ పనులు చెయ్యాలన్న విషయాన్ని లోతుగా ఆలోచించవద్దు.

**వాస్తవంగా చెప్పాలంటే, ఆత్మ పరిణామం చెందుతున్న కొద్దీ ఆ వ్యక్తి చెయ్యవలసిన పని కూడా పెరుగుతుంది!** కానీ అతను తన పనిని ఆడుతూ పాడుతూ చేస్తాడు! ఆ పనిని అమలు పరచటంలో ఎంతో సుఖాన్ని అనుభవిస్తాడు! భూలోకంలో ప్రతి ఒక్కరూ, పని చెయ్యటానికి తప్పించుకుంటారు లేదా పని చెయ్యటానికి ఎంతో కష్టపడతారు. అలా కాకుండా ఉన్నత సూక్ష్మలోకాల్లో పనిని పూజ్య భావంతో చేస్తారు. పని చెయ్యటంలో నిమగ్నమవ్వటం వలన ఎంతో ఆనందాన్ని

పొందుతారు. ఆ లోకాల్లో ఎవ్వరూ కూడా సోమరితనం గా వృధాకాలయాపన చెయ్యటం కోరుకోరు.

అందువలన మీరు కూడా మీ పనిని ప్రేమించటం ప్రారంభించండి. సోమరిగా, ఒంటరిగా ఉన్న మనస్సు ఎన్నో అనవసరమైన విషయాలను సృష్టిస్తుంది. అందువలన మిమ్మల్ని మీరు మంచి పనులతో, ప్రగతినిచ్చే వ్యాపకాలతో నింపుకోండి.

ఇప్పుడు నేను చెప్పబోయేదేమిటంటే ' ధ్యానం ' చేయటం కూడా ఒక పనే. మీ భవిష్యాభివృద్ధికి సంబంధించిన ఒక పని - మిమ్మల్ని సక్రమమైన మార్గంలో నడిపించే ఒక పని - మీ అంతర్గత శక్తిని మీకు తెలియజేసే ఒక పని - విశ్వశాంతి ప్రేమకోసం పనిచేసే ఒక పని - మీరు ఎక్కడ నుంచి వచ్చారో మిమ్మల్ని అక్కడికి తీసుకుని వెళ్ళే ఒక పని. అందువలన, మీరు నిజాయితీతో ధ్యానం చెయ్యండి.

యిప్పుడు ప్రశ్న యొక్క చివరి భాగం అంటే - " కర్మచక్రం నుంచి విముక్తి ఎలా పొందాలి? లేదా మీ ' బ్యాలెన్సు షీట్ ' ని ఎలా శూన్యం చేసుకోవాలి?"

" కర్మ సిద్ధాంతం " గురించి తెలుసుకోవటం కోసం ఎన్నో విషయాల్ని మనం చూశాం; ఈ కర్మచక్రంలో ఎలా చిక్కుకుపోయామో కూడా తెలుసుకున్నాం. దాని నుంచి మనం ఎలా బయటికి రావాలో కూడా తెలుసుకున్నాం. పై ప్రశ్నకు సమాధానం ముందు తెలుసుకున్న విషయాలన్నింటి సారాంశమే.

తూర్పు దేశాలకు సంబంధించిన మాస్టర్లు కర్మ సిద్ధాంతానికి ఎందుకు ప్రాధాన్యత ఇచ్చారు? మంచి విధానాల్ని మాత్రమే బోధించి ఎందుకు వదలి వేయలేదు. ఎందువలనంటే, మీరు కర్మ-చక్రం నుండి బయటకు రానంత వరకూ మరో జన్మ తీసుకోక తప్పదు. ' మరొక జన్మ ' అంటే ప్రాపంచిక విషయాలతో కలిసి ఉండాల్సిన అవసరం ఏర్పడుతుంది. - సత్యపథం నుండి వైదొలగడానికి కారణభూతమవుతుంది. భూలోకంలో ఎన్నో ఆకర్షణలకూ, వివిధ ఆలోచనా ధోరణులకూ అవకాశాలుండటం వలన మీ మార్గం నుండి తేలికగా మరలించబడతారు.

ఎప్పుడైతే మీరు కర్మ-చక్రం యొక్క చివరి దశలో ఉంటారో అప్పుడు మీరు ఎన్నో పరీక్షలనూ, ప్రేరణల్నీ సంపూర్ణ శక్తితో ఎదుర్కోవలసి ఉంటుంది. అందువలన మీరు ఈ పరీక్షల నెదుర్కోవటానికి సంసిద్ధతతో వుండాలి.

మీరు కొన్ని జన్మలుగా సంపూర్ణ ప్రేమ భావం కలిగి, సక్రమమైన జ్ఞానసముపార్జన చేస్తూ అందరికీ సహాయం చేస్తూ, అందరినీ సమాన దృష్టితో చూడటం వలన ఆ జీవితాల అనుభవాలు ' ఒక అలవాటు 'గా మారి, మస్తిష్కంలో లోతుగా చెక్కబడి ఉంటాయి. అందువలన, పరీక్షా సమయంలో కూడా మీరు ఒక్కసారిగా దిగజారిపోవడానికి అవకాశం లేదు. మీకు ఎదురైన దురదృష్టాలనూ, కష్టాలనూ చూసి మీరే నవ్వటం ప్రారంభిస్తారు! మీ సమస్యలకూ, కష్టాలకూ, దురదృష్టాలకూ పరిష్కారాన్ని చాలా సులువుగా పొంద గల్గుతారు.

కర్మ-చక్రం నుండి బయటపడటానికి అతి సుళువైన మార్గమేమిటంటే ఒక సామాన్యమైన, సంతృప్తికరమైన జీవితాన్ని గడపటం. సంపూర్ణప్రేమ, దయ, వివేక, విచక్షణా జ్ఞానాలతో జీవితాన్ని గడపటం. మీరు చిన్న చిన్న కోరికల నుండి మిమ్మల్ని మీరు దూరంగా ఉంచుకోవాలి.

మీరు గృహస్థ జీవనాన్ని అవలంబించటం వలన, ఎన్నో బాధ్యతలను ఎదుర్కోవలసి ఉంటుంది. మీరు మీ ముఖ్య అవసరాలకీ, అనవసరమైన కోరికలకీ మధ్య ఒక గీటు గీసుకోవాలి - భావోద్రేకాలకతీతంగా వుండాలి. ఒక మనోవికారం వేరొక రాగభావానికి దారి తీస్తుంది. అందువలన జీవితంలో అడుగడుగునా మీరు ఎంతో అప్రమత్తతతో మెలగాలి. ఎరుకతో ఉండాలి. నిరంతరంగా మెళకువతో ఉండాలి. అంతేకాకుండా మీరు మీ భావోద్రేకాలనూ, మనో వికారాలనూ తెలుసుకుని అర్ధం చేసుకోగలగాలి. అప్పుడే మీరు వాటిని అధిగమించగలుగుతారు.

యిక్కడ మీకు ఒక సామాన్య ఉదాహరణ ద్వారా ప్రేమ అనే విషయాన్ని సక్రమంగా అర్ధం చేసుకోకపోతే కర్మ ఎలా కూడుకుంటుందన్న విషయం గురించి చెప్పదలచాను.

ఒక వ్యక్తి ఒక స్త్రీని ప్రేమించాడనుకుందాం. సత్యం గా, గాఢం గా ప్రేమించినట్లయితే అతను ఆమె యొక్క మంచి కోసమే ఆలోచిస్తాడు. అతను తన ప్రేమను స్వార్ధంతో కలిపినట్లయితే

ఏమవుతుంది? ఆ వ్యక్తి ఆమెను గాఢంగా ప్రేమిస్తున్నాననుకోవచ్చు, అలాగే ఆమె కూడా అతనిని ప్రేమించి ఉండవచ్చు. కానీ కొన్ని పరిస్థితులు చెయ్యి దాటటం వలన ఆమె వేరొకరిని పెళ్ళి చేసుకుంటుంది. అప్పుడు ఆమెను ప్రేమించిన వ్యక్తి కోపోద్రేకుడై సక్రమమైన ఆలోచనను కోల్పోతాడు. ఆ స్త్రీ తనని మోసం చేసిందనుకుంటాడు. ఆమెకు ఒక ' గుణపాఠం ' చెప్పాలనుకుని ఆమె జీవితంలో ఎన్నో అడ్డంకుల్ని సృష్టిస్తాడు! అతను క్రూరం గా మారుతాడు! క్రూరంగా మారిన మనస్సు భయంకరమైన ఆపదలను సృష్టిస్తుంది!

యిప్పుడు ' ప్రేమ ' ఎక్కడవుందో మీరు ఆలోచించండి? ఎక్కడకు వెళ్ళింది? ' నిజమైన ప్రేమ 'ంటే ఏ మాత్రం అర్థం తెలియక ప్రేమ పేరుతో ఎంతో చెడును చేస్తున్నాడు. అతడు ఆమెను నిజంగా ప్రేమించినట్లయితే ఆమె వివాహం చేసుకున్న వ్యక్తితో ఆమె సుఖంగా వుండాలనీ, శాంతియుత జీవితం గడపాలనీ ప్రార్థించే వాడు.

ప్రేమంటే యివ్వటం, ప్రతిఫలాన్నాశించకుండా మీ దగ్గర వున్నదంతా యివ్వటం.

అతను ఆమెను వివాహం చేసుకుంటే సరే, అలా జరగనట్లయితే, తన భావోద్రేకాల నధిక్రమించి అతను ఆమె యొక్క వున్నతి కోసం శ్రమ పడాలి. కోపాన్ని కలిగి వుండటం, బాధపడటం, జీవితాన్ని వృధాగా చెడ్డ దారులలో గడపటమనేది అతను జ్ఞానవంతుడవటానికి ఏ

మాత్రం సహాయపడవు. అందువలన సుఖప్రదమైన శాంతియుతమైన జీవితం కోసం ప్రతి ఒక్క భావావేశాన్నీ, ప్రతి ఒక్క వాంఛనూ ఎంతో జాగ్రత్తగా జల్లెడ పట్టాలి.

సుఖమైన, శాంతియుతమైన మనస్సు ద్వారా సరైన నిర్ణయాలను తీసుకోవచ్చు. సరైన నిర్ణయాలు తీసుకోవటం వలన ప్రగతి పథం వైపు దారి తీయవచ్చు.

కొందరు ప్రజలు అవివేకంతో ఎలా ప్రశ్నిస్తారంటే - " చెడ్డ పనులను విసర్జించాలంటే దేవుడు వాటిని ఎందుకు సృష్టించాడు? "

ఈ ప్రశ్నను అర్ధం చేసుకోవాలంటే ' దేవుడి ' గురించి మీరు తెలుసుకోవాలి. దేవుడు ఒక యధార్ధమైన సంరక్షకుడు. ఆయన మిమ్మల్ని ప్రేమిస్తూ, ఎంతో శక్తినీ, జ్ఞానాన్నీ యిచ్చి " పూర్తి స్వాతంత్ర్యం " కూడా యిచ్చాడు. ఒక తండ్రి తన పిల్లవాడిని " ఆ పని చెయ్యొద్దు ", " ఈ పని చెయ్యొద్దు " అనినట్లయితే, అప్పుడు ఆ పిల్లవాడు తన తండ్రి లేని సమయంలో ఆసక్తి కొద్దీ అదే పనిని చెయ్యటానికి ప్రయత్నిస్తాడు.

నిజమైన తండ్రి ఎవరంటే, ఏ పని చెయ్యటంలోనైనా తన పిల్లలకి పూర్తి స్వాతంత్ర్యాన్ని యివ్వటమే కాకుండా మంచి చెడ్డల జ్ఞానాన్ని కూడా యిచ్చినటువంటివాడు. అదేవిధంగా దేవుడు కూడా తన వద్దనున్నది సంపూర్ణంగా, పరిపూర్ణప్రేమతో య్విటమే కాకుండా మీకు

తోచిన విధంగా మంచి - చెడ్డల జ్ఞానాన్ని ఉపయోగించి ఏ పనినైనా చేయటానికి పూర్తి స్వాతంత్ర్యాన్నిచ్చాడు.

ఆయన జ్ఞానాన్నీ, శక్తినీ, మంచి-చెడ్డలని గ్రహించటానికీ ఒక ' మనస్సు ' ని కూడా యిచ్చాడు. మీలో వున్న యథార్థమైన శక్తిని గుర్తించటానికి లక్ష్యపెట్టక, పూర్ణాత్మని లక్ష్యపెట్టక, మీరు భ్రాంతులలో మునిగిపోవటం వలన మీలో అంతర్గతంగా వున్న స్వర్గాన్ని, భగవంతుని స్వరాన్ని వినటానికి తయారుగా లేరు! యిప్పటికే మీరు ఎంతో సమయాన్ని వృథా చేసుకుంటూ మీ నిజతత్వానికి ఎంతో దూరంగా పయనించారు! కనీసం యిప్పటినుంచైనా మీ మార్గాన్ని మార్చుకుని, మీ అంతిమ స్వేచ్ఛ కోసం ప్రయత్నించండి! మీరు మంచి మార్గం నుండి సంపూర్ణంగా 180º కోణంలో పయనించారు. సరిగ్గా వ్యతిరేక దిశలో పయనించటం వలన మీ ప్రయాణం గమ్యాన్ని ఎన్నడూ చేరుకోలేదు.

' రేపటి ' కోసం ఎదురు చూడకుండా, యిప్పుడే మీ మార్గాన్ని మార్చుకోండి. భవిష్యత్తు గురించి ఆలోచించటం అన్నది ఏ మాత్రం సహాయపడదు. మీ చేతిలో వున్న ఈ క్షణమే-మీ ఆధీనంలో వున్న ఈ క్షణమే-మీకు సహాయ పడగలదు. వర్తమానంలో జీవించటానికి ప్రయత్నించండి. దాని విలువనూ, ప్రయోజనాన్నీ గుర్తించండి.

కర్మబంధాల నుంచి బయట పడటం చాలా తేలిక! కానీ, మీకు సాధన అవసరం. ఈ సందేశంలో చెప్పిన విధంగా మీరు మీ

జీవితాలలో పూర్తి అంకిత భావంతో, నిజాయితీతో కొంత కాలం సాధన చేసినట్లయితే అప్పుడు దానంతటదే సాధ్యమై సులభమవుతుంది.

సాధారణమైన, సమతుల్య జీవితం గడపటమనేది కృత్రిమం గా జీవించటం కంటే చాలా సులభమైనది. ప్రకృతి సిద్ధమైన ప్రతీదీ ఎంతో అందమైన, సులభమైన, మరి సుఖశాంతులు కలిగి వున్నదీనూ. అందువలన స్వాభావికమైన జీవితాన్ని జీవించండి.

మీకు కావలసినదల్లా దృఢమైన నిర్ణయం. వాస్తవాలని అంగీకరించటానికి, సంపూర్ణ నిశ్చయంతో ప్రయాణించటానికి ప్రతి ఒక్కరికీ ధైర్యముండాలి. బంధాలూ, ఆకర్షణలూ, భ్రమలూ కల్గించే ఆనందమనేది అనేక జన్మల తరబడి మీ దృక్పధాల వలన ఎంతో శక్తివంతమవ్వటం వలన, దానిని ఛేదించటం చాలా కష్టతరంగా ఉంది. కానీ, ' నిరంతర ప్రయత్నం ' - వలన అది ఫలవంతమవుతుంది.

ఆది నుంచీ మీ కోసం వేచి వున్న సుఖం, ఆనందం, జ్ఞానం, శక్తి ఆలోచించటానికలవి కానివిగా వుండి, వర్ణనాతీతమైన మీ ఊహలకే అందనటువంటివిగా వున్నాయి!

ఒక్కసారి దానిని, ఆ బ్రహ్మానందాన్ని, చవిచూసినట్లయితే అదేమిటో మీరు తెలుసుకుని, ఈ ప్రాపంచిక వాంఛలనెప్పుడూ మీరు కోరుకోరు! మీరు మీ వ్యక్తిత్వం లో సంపూర్ణంగా మార్పు చెందటం వలన ' కర్మ ' అనేది మీ బాట నుండి వైదొలగుతుంది.

**ఈ సందేశానికి ముగింపుగా, కర్మబంధాల నుంచి ఈ క్రింది మార్గాల వలన మీరు బయట పడవచ్చు.**

1. సామాన్యమైన జీవితాన్ని గడపండి!
2. ఎప్పుడూ ఇతరులను ప్రేమిస్తూ వారి పట్ల శ్రద్ధ చూపండి!
3. మీ మనస్సుకి మీరు యజమాని అవ్వండి!
4. సత్యమైన విజ్ఞానాన్ని అభ్యసించటం వలన అది జ్ఞానానికి దారి తీస్తుంది!
5. మీలో అంతర్గతమైన శక్తిని గుర్తించి, తద్వారా అనంతమైన విజ్ఞానం గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించండి. మీరు మార్గదర్శం చేయబడటానికి మీ పూర్ణాత్మతో అనుసంధానం ఏర్పరచుకోటానికి ప్రయత్నించండి!
6. వాంఛల నుండి బయటపడండి!
7. మీ జీవితంలో జరిగే ప్రతి ఒక్క విషయాన్నీ, ప్రతి సంఘటననూ సంతులమైన మనస్సుతో స్వీకరించి, ప్రతి ఒక్క మార్పూ మీరు అభ్యసించటానికేనని తెలుసుకోండి!
8. ధైర్యంగా వుండి, నిశ్చయభావం కలిగి, నిరంతరంగా శ్రమిస్తూ సత్యశోధనకై పాటుపడండి!
9. యితరులూ అజ్ఞానం నుంచి బయటపడేలా ప్రయత్నించండి!
10. అవిశ్వాసాలను ఎప్పుడూ ప్రచారం చెయ్యవద్దు!

*నా ఆశీస్సులు మీకు ఎప్పుడూ ఉంటాయి! మీ ఆధ్యాత్మిక పథంలో విజయం చేకూరాలని కోరుతాను!!*

**- భీష్మ**

# కర్మయోగం

▲ " మనస్సులో జ్ఞానం రాతిలో దాగిన అగ్నిలాగా వుంటుంది; దానిని స్ఫురింపచేయడమే వెలువడచేసే ఒఉపిడి. ఇలా మనలనే మనం నెమ్మదిగా పరిశీలించి చూసుకుంటే-అనేక అభిఘాతాలు మనకు కలిగినప్పుడు-మన కన్నీళ్ళు, మందహాసాలు, సంతోషాలు, దుఃఖాలు, నవ్వులు, ఏడ్పులు, ఆశీర్వచనాలు, శాపాలు, స్తుతులు, నిందలు-అన్నీ మనమండి వెలువడినవే అని మనకు స్పష్టమౌతుంది. వీటన్నిటి ఫలితమే మన ప్రస్తుత స్థితి; ఈ సంఘటనలే మొత్తం మీద ' కర్మ ' లనబడుతున్నాయి. ఆత్మకు వున్న శక్తి జ్ఞానాలను కనుగొనచేసేది ఐన ప్రతి మానసిక భౌతిక ప్రహారం '' కర్మ 'యే. "

★ ★ ★

▲ " ప్రపంచంలో జన్మించిన సంకల్పబలాన్వితు లందరూ మహా కార్యశూరులు - లోకాన్ని తలక్రిందులు చెయ్యగలిగిన అఖండ శక్తిమంతులు. యుగయుగాల నుంచీ చేస్తున్న నిరంతర కృషిచే వారికి అలాంటి సంకల్పబలం చేకూరింది. "

★ ★ ★

▲ " గడింపకుండా ఎవరికీ ఏదీ దక్కదు; ఇది శాశ్వత నియమం ".

★ ★ ★

▲ " మన వర్తమానస్థితి పూర్వకర్మల ఫలితమైతే, మనం పొందగోరే

స్థితి ప్రస్తుత కర్మల ఫలితంగా పొందబడుతుందని నిశ్చయమౌతోంది. ' కర్మ నెలా నిర్వర్తించాలో తెలుసుకోవటం వలన ఫలితం ఏమిటి? లోకంలో ప్రతి వ్యక్తీ ఏదో ఒక విధమైన కర్మను నిర్వర్తిస్తూనే వుంటాడు గదా? కౌశలంతోనూ, శాస్త్రదృష్టితోనూ కర్మను నిర్వర్తించడానినే ' కర్మయోగం ' అని భగవద్గీత వెల్లడిస్తోంది; నిర్వర్తించవలసిన విధానాన్ని తెలుసుకుంటే కర్మచే నిరతిశయ మహాఫలాలను పొందవచ్చును. "



▲ " ప్రాప్తకార్యాలను చేస్తూ, నిస్వార్థంతో ప్రారంభం నుంచే మనం కర్మయోగాన్ని ప్రారంభించాలి. మనం కర్మను నిర్వర్తించాలి, కర్మాచరణానికి మనల్ని పురికొల్పుతున్న శక్తి ఏదో గమనించాలి. ప్రారంభంలో కొన్ని సంవత్సరాలపాటు కర్మాచరణానికి మనలను ప్రేరేపించేది తప్పక స్వార్థమే అని గ్రహిస్తాం; అయినా పట్టుపట్టి క్రమంగా యీ స్వార్థపరత్వాన్ని నశింపచేస్తే చివరకు నిజంగా నిస్వార్థకర్మను నిర్వర్తించే సమయం సదా వచ్చి తీరుతుంది. జీవితగమనంలో ముందుకు వెళ్తూవుంటే మనం పూర్తిగా నిస్వార్థులమయ్యే రోజు ఎప్పుడో ఒకరోజు వస్తుందని ఆశించవచ్చును; ఈ స్థితి ప్రాప్తించగానే మన శక్తులన్నీ ఏకాగ్రమౌతాయి; సహజజ్ఞానం వ్యక్తమౌతుంది. "



▲ " సాంఖ్యదర్శనాన్ని బట్టి ప్రకృతిలో మూడు శక్తులున్నాయి. సంస్కృతంలో వాటిని సత్త్వ రజ స్తమస్సు లంటాం. అంధకారం

(లేదా నిర్వ్యాపారత) తమోలక్షణం; రాగద్వేషరూపంలో వ్యక్తమయే సవ్యాపారస్థితి రజో లక్షణం. సవ్యాపారతా నిర్వ్యాపారతల సామ్యావస్థ సత్వలక్షణం ."



▲ " 'చెడును ప్రతిఘటించటం అన్నది అప్రతిఘటనమనే ఆ మహోన్నత సత్యావిష్కృతికి అందించే మెట్టు, అనీ తెలుసుకున్నవాడు ' కర్మయోగి '. ఈ మహోన్నతాదర్శాన్ని పొందడానికి ముందుదశలో చెడును ప్రతిఘటించడమే మానవుడి కర్తవ్యం; అందుకై అతణ్ణి పాటుపడనివ్వండి, పోరాడనివ్వండి, భుజాన్నెత్తి సూటిగా కొట్టనివ్వండి. ప్రతిఘటించగల శక్తిని గడించిన తరువాతే అప్రతిఘటనం గుణమౌతుంది ."



▲ " కాబట్టి మీ అధికారవాంఛనూ, తదితరవాంఛలనూ తీర్చుకోండి. తీర్చుకున్నాక ఇవన్నీ కేవలం తుచ్ఛవిషయాలని గ్రహించే సమయం వచ్చితీరుతుంది; అంతేగానీ యీ వాంఛలు నెరవేరకుండా, యీ పాట్లుపడకుండా - ప్రశాంతి నిలయమైన ఆత్మసమర్పణ స్థితికి మీరు రావడం అసంభవం ."



▲ " ప్రతివ్యక్తీ స్వంత ఆదర్శాన్నే అవలంబించి దానిని సాధించడానికి ప్రయత్నించాలి; తానెన్నటికీ సాధించుకోలేని ఇతరుల ఆదర్శాలను

ఆచరించడానికంటే పురోభివృద్ధికి ఇదే ఖచ్చితమైన మార్గం. ఏ ఆదర్శాన్ని గానీ పరిహసించడానికి మనకు హక్కులేదు. స్వీయాదర్శ స్థితికే ప్రతివ్యక్తినీ యథాశక్తి ప్రయత్నించమనాలి. "

★ ★ ★

▲ " సదా కర్మనిరతుడై తన విద్యుక్త ధర్మాలను నిర్వహిస్తూ కర్మఫలాలను ఈశ్వరార్పణ చెయ్యాలి. "

★ ★ ★

▲ " తల్లికీ తండ్రికీ, బిడ్డలకూ, భార్యకూ, పేదలకూ పెట్టకుండా గృహస్థుడు భుజిస్తే అది పాపం అవుతుంది. ఈ శరీరానికి తల్లిదండ్రులే కారకులు. కాబట్టి వారికి మేలుచేయడానికి మానవుడు లక్షకష్టాలైనా అనుభవించటం కర్తవ్యం. "

★ ★ ★

▲ " బిడ్డలపట్ల గృహస్థుడు అవలంబించాల్సిన ధర్మాలివి: నాలుగేళ్ళ ప్రాయం వచ్చేవరకు కుమారుణ్ణి ప్రేమానురాగాలతో పెంచుతూ పదహారేళ్ళవరకు విద్యాబుద్ధులను గరపాలి. ఇరవై ఏళ్ళ ప్రాయంలో అతడిని ఏదో ఒక ఉద్యోగంలో ప్రవేశింపచెయ్యాలి. అప్పుడు తండ్రి అతడిని ప్రేమతో తన సమానుడిగా చూడాలి. సరిగ్గా ఇదే విధంగా కుమార్తెను పెంచి శ్రద్ధగా ఆమెకు విద్యాబుద్ధులను గరపాలి. వివాహసమయంలో తండ్రి ఆమెకు నగలను, ధనాన్ని ఒసగాలి. "

★ ★ ★

▲ " దుర్మార్గులను గౌరవించకుండటం గృహస్థుడి విధి. దుర్మార్గులపట్ల గౌరవం చూపితే దౌర్జన్యాన్ని ఆదరించినవారౌతారు. గౌరవార్హులైన సజ్జనులను అగౌరవించినా తప్పే! స్నేహం చేసుకోవటంలో తొందర పడకూడదు. తన దారి వదిలి కనబడ్డవాళ్ళతో స్నేహం చెయ్యకూడదు. తను స్నేహం చెయ్యాలనుకున్నవారి చర్యలను, ఇతరులతో వారు నెరపే వ్యవహారధర్మాలను కనిపెట్టి, వాటిని గూర్చి పర్యాలోచించి తరువాతే వారితో స్నేహం చెయ్యాలి. "

★ ★ ★

▲ " ముందుగా విద్యను ఆ తరువాత ధనాన్ని ఆర్జించుకోవడానికి తప్పక శ్రమపడి ప్రయత్నించాలి. అది అతడి విధి. తన విధిని నేరవేర్చకపోతే ఆతడు గృహస్థుడు కాడు. ధనాన్ని గడించడానికి శ్రమపడని గృహస్థుడు ధర్మం తప్పినవాడు. అలసుడై పనికిమాలిన జీవితంతో తృప్తిపడేవాడు అవినీతిపరుడు. "

★ ★ ★

▲ " ధర్మమార్గంలో ధనం సంపాదించి, ధర్మకార్యాలకై దానిని వినియోగించటం ఒక సేవ. ఎందుకంటే సన్మార్గంలో ధనం సంపాదించటం, దానిని సత్కార్యాలకై వినియోగించడానికి ప్రయత్నించేవాడు గుహలో ధ్యానమొనర్చే తపస్వి ఎలాటి మోక్షసాధన చేస్తున్నాడో అలాటి మోక్షసాధననే ప్రాయికంగా చేస్తున్నాడు. "

★ ★ ★

▲ " ధర్మాలలో దేని స్థానం దానికి వుంది. మన పరిస్థితులను బట్టి మన ధర్మాలనూ నిర్వర్తించాలి. లోకుల వేళాకోళాలనూ, హేళనలనూ పట్టించుకోక మానవుడు తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి. "

★ ★ ★

▲ " తత్త్వజ్ఞానం ఒక్కటే మానవుడి లోట్లను శాశ్వతంగా నిర్మూలిస్తుంది. కాబట్టి మానవుడికి చేసే ఆధ్యాత్మిక సహాయమే మహోన్నతసాయం. తత్త్వజ్ఞానం దానం చేసేవాడే లోకంలో నిరతిశయోపకారి. ఎందుకంటే జ్ఞానమే మానవుడి యథార్థజీవితం. "

★ ★ ★

▲ " వ్యక్తి స్వభావం మార్చేవరకూ యీ శారీరావశ్యకాలు, దుఃఖాలు సదా కలుగుతూనే వుంటాయి; లోకంలో కనిపించే చెడు అంతా, దురవస్థ అంతా అజ్ఞాన ప్రభావమే. మానవుడు జ్ఞానిగానూ, విశుద్ధుడుగానూ, ఆత్మబలాఢ్యుడుగానూ, విద్యావంతుడుగానూ ఐన తరువాతే లోకంలోని దుఃఖం నివర్తిల్లుతుంది, అంతకుముందు కాదు. "

★ ★ ★

▲ " ' సంస్కారం ' అంటే ' ఆంతరప్రవృత్తి ' అని చెప్పవచ్చును. మనం చేసే ప్రతికార్యమూ, శరీరంలోని ప్రతి చలనమూ, మనం చేసే ప్రతి ఆలోచనా మనస్సులో ఇలాంటి సంస్కారాన్ని కలిగిస్తుంది. ఈ సంస్కారాలు పైకి మనకు కనబడకపోయినా అంతర్గతంగా వుండి

అజ్ఞాతంగా పనిచెయ్యడానికి తగినంత శక్తిమంతాలై వుంటాయి. మనస్సులోని సంస్కారసమామ్నాయంచేత మన స్థితిగతులు అనుక్షణం నిర్ణీతాలౌతున్నాయి. ఎన్నో సత్కార్యాలను చేసి సదాలోచనలు చేసిన వ్యక్తికిక ముందుకూడా సత్కార్యాలను చెయ్యాలని అనివార్యమైన బుద్ధిపుడుతుంది. ఒకవేళ చెడుచేయాలని అతడు కోరినా అతడి సంస్కారాలన్నిటి ఫలితంగా అతడి మనస్సు అలా చెయ్యనివ్వదు; మంచిసంస్కారాలు అతడి బుద్ధిని మరలుస్తాయి; వాటి కా వ్యక్తి పూర్తిగా అధీనుడై వున్నాడు. "



▲ " ఈ ప్రపంచం మన నివాసం కాదు; మనం చేసే యాత్రలో గమించవలసిన అనేక మజిలీలలో ఇది ఒకటి. ' ఆత్మార్థత్వాత్ సృష్టేః'. ప్రకృతి సమస్తం ఆత్మకోసమే, ఆత్మ ప్రకృతి కోసం కాదనే సాంఖ్యసూత్రాన్ని స్మరించు. పురుషుడి శిక్షణకోసం మాత్రమే ప్రకృతి ఏర్పడివుంది; దాని ఉనికికి ఇంతకంటే వేరే అర్థం లేదు. పురుషుడు జ్ఞానవంతుడై కైవల్యాన్ని పొందాలి, అందుకే ప్రకృతి సంస్థితమై వుంది. "



▲ " సదా ప్రకృతే మనమని భ్రమిస్తూ ప్రకృతి మోహితులమౌతున్నాం. ఇలాంటి మోహం (సంగం) పుట్టగానే మనస్సులో ప్రగాఢ సంస్కారం ఏర్పడుతుంది. అది మనలను బద్ధులనుచేసి స్వేచ్ఛతో కాకుండా బానిసలవలె పనులను చేయిస్తున్నది. "



▲ " కర్మయోగోప సారమంతా ఇది: బానిసలా కాకుండా యజమానిలా కార్యాలను నిర్వర్తించు; స్వార్థపరమైన కర్మాచరణ దాసుని కర్మాచరణ. కర్మకు నిజమైన ప్రమాణం ఇది; ప్రేమ సంజనితమైన ప్రతికార్యమూ ఆనందాన్ని కలిగిస్తుంది; నిజమైన అస్తిత్వం, నిజమైన జ్ఞానం, నిజమైన ప్రేమ ఒకదానితో ఒకటి శాశ్వతంగా సంబద్ధాలై వున్నాయి. "

★ ★ ★

▲ " దాతవై ప్రతివస్తువునూ ఫలాపేక్ష లేకుండా లోకానికి సమర్పింప గలిగితే మీ కర్మలు మీకు బంధాన్ని కలిగింపవు. ఫలాపేక్ష వుంటేనే బంధం కలుగుతుంది. "

★ ★ ★

▲ " ప్రాణాలను కూడా లక్ష్యపెట్టక, ప్రశ్నలేవీ అడగకుండా పరులకు తోడ్పడటమే కర్మ యోగం. అనేక వేలసార్లు వంచించబడ్డా ఏమీ అడుగవద్దు. ఇంత ఘనకార్యం చేస్తున్నామని కలలో కూడా తలచవద్దు. "

★ ★ ★

▲ " మీరొక కర్మను నిర్వర్తిస్తున్నప్పుడు ఇతరమైన దేనినీ లక్ష్యపెట్టవద్దు; ఏ ఆశ్రమ ధర్మాన్నైనా సక్రమంగా, ఫలాపేక్ష లేకుండా నిర్వహిస్తే మహోన్నతమైన ఆత్మానుభవం లభిస్తుంది ".

★ ★ ★

▲ " ఫలాపేక్ష లేని వ్యక్తికి సమస్తకర్మలూ సమానయోగ్యాలై కనబడతాయి; ఆత్మస్వాతంత్ర్యాన్ని పొందడానికి అవన్నీ వారికి పటుతర

సాధనాలుగానే అగపడతాయి. తత్త్వవిచారమే నిస్సంశయంగా ప్రతిమతం యొక్క సారాంశం. "



▲ " మీ చేతా, నా చేతా ఉపకారం పొందడానికి యీ లోకం సృష్టింపబడలేదు. ఈ ప్రపంచం ' మంచిది ' కానీ చెడ్డదికానీ కాదు; ప్రతివ్యక్తీ తనకు తానే ఒక లోకాన్ని నిర్మించుకుంటాడు. మన మనోస్థితిని బట్టి, మన దృక్పథాన్ని బట్టి జీవితం ' మంచిది 'గా గానీ ' చెడ్డది ' గా గానీ కన్పిస్తుంది; స్వతస్సిద్ధంగా అది వీటిలో ఏదీ కాదు. "



▲ " ధన్యత దాతకేకాని దానం పుచ్చుకున్నవాడికి కాదు; కాబట్టి ' లోకోపకార ' మనే మూర్ఖప్రలాపాల్ని విరమిద్దాం; లోకం మీ సాయం కోసం, నా సహాయం నిమిత్తం పడిగాపులు పడివుండలేదు. ఐనా ఎప్పుడూ కార్యనిమగ్నులమై సత్కార్యాలనే చేస్తూండాలి. ఎందుకంటే దానివల్ల మేలు మనకే. పరిపూర్ణుల మవడానికి ఇదొక్కటే మనకు మార్గం. "



▲ " మన వాతావరణంలో మంచి చెడ్డవైన భావస్పందనలు-రెండూ నిండి వుండే అవకాశం ఎంతైనా వున్నది. ప్రతి మనస్సు నుండి వెలువడే ప్రతి భావమూ తనను స్వీకరించడానికి అనువైన మనస్సును కలుసుకునే వరకు స్పందిస్తూ పయనిస్తూనే వుంటుంది. ఇలాంటి

భానాలను గ్రైకొనడానికి కవాటాన్ని తెరిచివుంచుకున్న ఏ మానసమైనా వెంటనే వాటిని స్వీకరిస్తుంది. కాబట్టి ఒక వ్యక్తి దుష్కార్యాలను చేస్తున్నప్పుడు అతడు తన మనస్సును ఫలానా ' బిట్టుస్థాయి 'కి తెచ్చుకుంటాడు. అలాటి స్థాయికి తగినట్టి, వాతావరణంలో ఇది వరకే వున్నవని చెప్పుకున్న తరంగాలన్నీ అతడి మానసంలో ప్రవేశించడానికి తొక్కిసలాడతాయి. దుష్కార్యాలను చేసే వ్యక్తి సాధారణంగా చెడుపనులను ఇంకా యింకా ఎక్కువగా చేయడానికి కారణం ఇదే. అతడి దుష్కార్యాలు తీవ్రంగా పెరిగి పోతూంటాయి. సత్కార్యాలు చేసే వ్యక్తి విషయం కూడా ఇలాగే వుంటుంది; వాతావరణంలోని ' మంచి ' కెరటాలన్నిటినీ అతడు తనలోనికి చొరవనిస్తాడు; అతడి సత్కార్యాలు మరింత పెరిగిపోతాయి. కాబట్టి దుష్కార్యాలు చేసే పక్షంలో రెండు రకాల ఆపదలకు గురవుతున్నాం: మనలను ఆవరించి వున్న దుర్భావాలన్నిటికి మనలోకి ప్రవేశమిస్తున్నా మనడం ఒకటి, కొన్ని వందల సంవత్సరాల తరువాతైనా ఇతరుల మీద ప్రభావం చూపే చెడును సృష్టించటం రెండవది. మన దుష్కార్యాచరణం వల్ల మనకూ, ఇతరులకూ బాధ కలుగుతుంది. మన సత్కార్యాచరణ వల్ల మనకూ, పరులకూ మంచి కలుగుతుంది. అంతేకాక మానవుడిలోని ఇతర శక్తులన్నిటిలాగా ' మంచి ', ' చెడు ' అనే యీ శక్తులూ బాహ్యప్రపంచం నుండి తాము బలాన్ని సంపాదించుకుంటున్నాయి. "



▲ " కర్మయోగానుసారం, మనం చేసే కర్మ ఫలవంతం కానిదే నశించదు. ప్రకృతిలోని ఏ శక్తీ దానిని ఫలింపనివ్వక నిరోధించలేదు. నేనొక దుష్కార్యాన్ని చేస్తే దాని దుష్ఫలాన్ని నేను అనుభవించి తీరాలి; యీ ప్రపంచంలోని ఏ శక్తీ దాన్ని మాన్పలేదు, ఆపలేదు. ఇలాగే నేనొక సత్కార్యాన్ని చేస్తే అది సత్ఫలప్రదం కాకుండా అడ్డుకునే శక్తి యీ ప్రపంచంలో లేదు. కారణముంటే కార్యం వుండితీరాలి, దాన్ని ఏదీ ఆపలేదు, అడ్డుకోలేదు. "

★ ★ ★

▲ " మనమెంత ప్రయత్నించినా పూర్తిగా పవిత్రమని చెప్పదగ్గ కర్మగాని, పూర్తిగా అపవిత్రమని చెప్పదగిన కర్మగాని వుండబోదు. "

★ ★ ★

▲ " ఇతరులకు మేలు చేయాలనే నిరంతర ప్రయత్నంచే మనలను మనం మరచిపోవడానికి ప్రయత్నిస్తున్నాం. ఇలా మనలను మనం మరచిపోవడమే జీవితంలో నేర్చుకోదగిన గొప్ప గుణపాఠం. "

★ ★ ★

▲ "మహోన్నత లక్ష్యమేమంటే 'నేను' అనేది పూర్తిగా లేక, అఖండం, నిత్యం ఐన అహంకార త్యాగం. తెలిసినా తెలుసుకోకపోయినా కర్మయోగం మానవుణ్ణి యీ పరమావధిని పొందిస్తుంది. సమస్త నీతికీ అహంకారత్యాగమే మూలాధారం; మానవుల విషయంలోగానీ,

జంతువుల విషయంలోగానీ, దేవతల విషయంలోగానీ, సమస్త నీతివ్యవస్థలకూ ఇదే మూలతత్త్వం, ప్రధానాశయం. "



▲ " ఒకటి ' ప్రవృత్తి ' అంటే మెలగటం; రెండవది ' నివృత్తి ' అంటే తొలగటం. సమస్త ప్రాంతాలనుండి సమస్త వస్తువులను తనకు ప్రియతమమైన 'నేను' అనే స్థానంలో కూడబెట్టుకొనే మానవసహజ ప్రవణతే యీ ప్రవృత్తి. సమస్త నీతికీ, పారమార్థపరత కంతటికీ నివృత్తే మూలాధారం. అహంకారం పూర్తిగా నశించటమే, ఇతరునికై మనస్సును శరీరాన్ని సర్వస్వాన్ని త్యజింప సంసిద్ధుడవటమే నివృత్తి ధర్మపరిపూర్తి, ఈ స్థితిని ప్రాపించిన మానవుడు కర్మయోగ పరమావధిని పొందినవాడు. "



▲ " కర్మయోగం ఇలా బోధిస్తుంది: 'లోకాన్ని విడువవద్దు. లోకంలో వర్తిస్తూ దాని ప్రభావాలను సాధ్యమైనంతవరకు జీర్ణించుకో. నీ భోగానుభవానికే అయినప్పుడు కర్మ చెయ్యనే చెయ్యవద్దు.' భోగానుభవం లక్ష్యంగా వుండకూడదు. మొట్టమొదట అహంకారాన్ని చంపుకుని, సమస్తలోకమూ నువ్వే అని భావించు. "



▲ " చంపి తినడానికే జంతువులన్నీ మనకోసమే సృష్టించబడ్డాయని,

యీ ప్రపంచమంతా మన భోగం కోసమే సృష్టించబడిందని వాళ్ళు మనకు బోధిస్తారు. ఇదంతా అవివేకం. "

★ ★ ★

▲ " సక్రమంగా కర్మను నిర్వర్తించడానికి మీరు ముందుగా కోర్కెను విడిచిపెట్టాలి. తరువాత సంసార కల్లోలంలో కలవక కేవలం సాక్షివై కర్మను కొనసాగించాలి. నా గురుదేవు డిలా అనే వారు: మీ బిడ్డల పట్ల దాది చూపే భావాన్ని వహించండి. దాది నీ బిడ్డను ఎత్తుకుని ముద్దాడి, ఆటలాడిస్తూ అది తన స్వంతబిడ్డే అన్నంత సుతారంగా దానితో వర్తిస్తుంది; కానీ ' ఇక ఇంటికి పోవచ్చు ' అని మీరు ఆమెకు చెప్పగానే తన మూటముల్లె సర్దుకుని వెంటనే బయలుదేరడానికి సిద్ధపడుతుంది. అంతకు ముందుండిన రాగమంతా అప్పుడు విస్మరింపబడుతోంది; మీ బిడ్డను విడిచిపెట్టినప్పుడూ, ఇతరుల బిడ్డలను గైకొన్నప్పుడూ సాధారణమైన దాది కెలాంటి వ్యాకులతా వుండదు."

★ ★ ★

▲ " లోకంలో ఎవ్వరూ మన మీద ఆధారపడ లేదనీ, ఏ బిచ్చగాడూ మన దానధర్మాల మీద ఆధారపడడనీ, ఏ జీవీ మన దయాదాక్షిణ్యాలపై ఆధారపడడనీ, ఏ ప్రాణీ మన సహాయానికై దేవులాడడనీ, మన మనస్సులకు మనం చెప్పుకోవాలి. "

★ ★ ★

▲ " ప్రపంచానికి తాను ఉపకారం చెయ్యడానికి జన్మించానని ఎవ్వరైనా అనుకోవటం అవివేకం, అహంభావం; అది సుగుణరూపంలో నటించే స్వార్థపరత్వం. మన మీదగానీ మరెవ్వరిమీదగానీ ప్రపంచం ఆధారపడలేదని గ్రహించేటట్లు మన మనస్సును మన నరాలనూ తర్ఫీదు చేసుకుంటే అప్పుడు మనం నిర్వర్తించే కర్మవలన వ్యధారూపమైన ఎలాంటి ప్రతిక్రియా కలుగదు. "



▲ " లోకంలో ఏదీ అతడి అనుమతి లేనిదే అతడి మనస్సు నాకర్షించలేదు. మనోనిగ్రహాన్ని సాధించిన వ్యక్తిపై భాహ్యమైన దేదీ ప్రభావం చూపలేదు. అతడికి యికమీద బంధం వుండదు. అతడు స్వాతంత్ర్య మనస్కుడు. అలాంటివాడే సంసారంలో చక్కగా జీవించడానికి సమర్థుడు. జీవభ్రాంతి తొలగగానే, దుఃఖమయంగా కనిపించే యీ ప్రపంచం ఆనందపూర్ణమైన స్వర్గమే ఐనట్లు కనిపిస్తుంది. దానిలోని వాతావరణమే పవిత్రమవుతుంది. ప్రతివ్యక్తి ముఖంలోనూ మంచే కనబడుతుంది. కర్మయోగోద్దేశమూ కర్మయోగ ప్రయోజనమూ అలాంటిది; అనుభవంలో దాని పరిపూర్తి అలాంటిది. "



▲ " ఏ యోగమైనా సరే మనం పూనికతో సాధించాలి. అంతే, కీలకమంతా సాధనలోనే వుంది. ముందుగా వినాలి, తరువాత మననం .

చెయ్యాలి. తరువాత అభ్యసించాలి. ప్రతి విషయమూ వెంటనే గ్రహించటం కష్టం. అన్నిటికి వివరణ మీలోనే వున్నది. నిజంగా ఇతరులచే నేర్పబడేవాడు లేడు. మనకు మనమే నేర్చుకోవాలి. వెలుపల బోధించేవాడు కేవలం మార్గసూచకుడు. ఆతడి సూచన మన ఆంతరంగికబోధకుణ్ని మేల్కొలుపుతుంది. అప్పుడు మన భావనాశక్తిచేతా, గ్రహణశక్తిచేతా విషయం మనకు స్పష్టమౌతుంది. దాని అనుభవం మనకు అప్పుడు మనలోనే కలుగుతుంది; ఇలాటి అనుభూతే ప్రగాఢ సంకల్పశక్తిగా పరిణమిస్తుంది; మొట్టమొదటిది ' అనుభూతి '; తరువాత అదే ' సంకల్పం ' గా పరిణమిస్తుంది; అప్పుడు దానినుండి అద్భుతమైన క్రియాశక్తి ఉదయిస్తుంది; ఆ తరువాత మన యావత్తు శరీరం కర్మయోగ సాధనంగా మారేవరకూ, అహంకారలయాన్ని అఖండ నిస్వార్థత ప్రాప్తించేవరకూ, ఆ క్రియాశక్తి మన ప్రతి నాళంలోకీ, ప్రతి నరంలోకీ, ప్రతి కండరంలోకీ చొచ్చుకుపోతుంది. "

★ ★ ★

▲ " ఏదో ఒక ఫలాన్నిచ్చే ఏ వ్యాపారమైనా, ఏ క్రియ ఐనా, ఏ తలం మీదైనా ' కర్మ ' అనబడుతోంది. ఇలా కర్మసిద్ధాంత మంటే, అనివార్యమైన కార్యకారణ నియతే. దీనిని ప్రతిఘటించటం శక్యం కాదు. కార్యముంటే కారణం వుండి తీరాలి; ఈ ప్రపంచంలో ఎక్కడగానీ మనం చూసేదంతా, చేసేదంతా, అనుభవించేదంతా ఒకవైపు పూర్వకర్మకు తను ఫలమై వుండటమే గాక మరోవైపు భవిష్యత్ఫలానికి తను కారణభూతమౌతుంది. "

★ ★ ★

# " కర్మ యోగం "

▲ " శాస్త్రాలలో రెండు మార్గాలు చెప్పబడ్డాయి. ఒకటి 'నేతి, నేతి - ఇదికాదు, ఇదికాదు ' అనే మార్గం. రెండవది, ' ఇతి, ఇతి - ఇది, ఇది ' అనే మార్గం. మొదటిది వ్యతిరేకమార్గం, రెండవది అన్వయమార్గం. మానవులలో అత్యధికులు అన్వయమార్గాన్నీ, సంసారమార్గాన్నీ ఎన్నుకుంటారు. బంధాలను బంధవిమోచన సాధనాలుగా వినియోగించుకుంటారు. ఇదీ ఒక విధమైన త్యాగమే. కాని విషయాలను తెలుసుకుని, విషయాలను అనుభవించి, ఆ విధంగా అనుభవాన్ని గడించి, వస్తువుల స్వరూపం తెలుసుకొని, మనస్సు వాటిని విడిచిపెట్టి సంగరహితమయ్యే వరకూ యీ త్యాగం మెల్లిగా మెట్టుమెట్టుగా జరుగుతుంది. మొదటిమార్గం వివేకంతో సంగరాహిత్యాన్ని అలవరచుకొనటం; రెండవమార్గం కర్మద్వారా, అనుభవంద్వారా సంగరాహిత్యాన్ని సాధించటం. "



▲ " కర్మయోగ మంటే ఏమిటి? కర్మరహస్యాన్ని గురించిన జ్ఞానం! ప్రపంచం సమస్తమూ కర్మను చేస్తూనే వుంది. ఎందుకు? స్వతంత్రం కోసం, మోక్షం కోసం! మనస్స్వతంత్రం కోసం, శరీరస్స్వతంత్రం కోసం, ఆత్మస్స్వతంత్రం కోసం! ఒకేలక్ష్యానికై - అణువు మొదలు మహోన్నత జీవివరకు కర్మను చేస్తున్నారు. "



▲ " 'కర్మ చేత గాదు, సంగం చేత దుఃఖం కలుగుతోంది '. 'నా దేహం ' అనుకోకు; ఉన్న చిక్కంతా ఇందులో వున్నది. ఈ శరీరం నీది కాదు, నాది కాదు, మరెవ్వరిదీ కాదు; ప్రకృతి నియమాలచే యీ శరీరాలు వస్తూ పోతున్నాయి. "



▲ " స్వార్థ చింతననూ, మమకారాన్నీ తల ఎత్తనియ్యవద్దు; వీటిని అణచగలిగినప్పుడు అణచి వెయ్యాలి; మనస్సులో దానికి సంబంధించిన వృత్తినికూడా కలుగనియ్యవద్దు. ఆ తరువాత మీరు సంసారంలో ప్రవేశించి యథాశక్తి కర్మను నిర్వర్తించవచ్చును. శరీరానికై మనం చేసేదేదీ వైరాగ్యం కాదు. వైరాగ్య మంతా మనోగతం. 'నేను, నాది' అనేవి మానసిక పాశాలు. మొట్టమొదట మనం వైరాగ్యాన్ని సంపాదించి తరువాత నిర్విరామ కర్మాచరణ దక్షులం కావాలి. "



▲ " మనం ఏ కర్మను చేసినా దాని వలన స్వలాభాన్నిగానీ, పరులచే పొగడ్తనుగానీ ఆశించరాదు. సర్వం భగవంతుడిదే, కర్మఫలాన్ని భగవంతుడికే సమర్పించు. మనం జగన్నాథుని సేవకులమనీ, ఆతడి ఆజ్ఞలను నిర్వర్తిస్తున్నామనీ, కర్మను చేసే ప్రతి క్షణమూ ఆతడే మనలను ప్రేరేపిస్తున్నాడనీ భావించి కర్మఫలాలపట్ల నిర్లిప్తులమై వుందాం. మనం ఆరాధించేదంతా, చూసే దంతా, చేసేదంతా, భగవంతునికి సమర్పించి

శాంతచిత్తులంగావాలి. పరిపూర్ణ ప్రసన్నచిత్తులమై మన మనశ్శరీరాలను సర్వాన్ని భగవంతుడికి శాశ్వత సమర్పణంగా - యజ్ఞంగా - అర్పించాలి. అగ్నిలో హవిస్సులను వ్రేల్చడానికి బదులు అహోరాత్రాలు యజ్ఞనారాయణుడికి అహంకార సమర్పణమనే యీ మహాయజ్ఞాన్ని, యీ ఏకైక యజ్ఞాన్ని ఒనర్చాలి. "



▲ " ' కర్తవ్య ' మనే సామాన్యాశయం క్రింది మెట్టుదని కర్మయోగం మనకు బోధిస్తుంది; ' కర్తవ్యం ' మనలో ఒక రుగ్మతగా పరిణమించి వుంది; ఇదే మనలను కర్మరంగానికి లాగుతోంది. బండికి పూన్చబడిన గుఱ్ఱం మాదిరి చివరకు ఏ నడివీధిలోనో ప్రాణాలు విడువవలసివచ్చే ఇలాంటి జీవితం కేవలం బానిసజీవితం గాదా? ' కర్తవ్య ' మంటే అందరికీ వర్తించే అర్థం ఇదే. దాస్యాన్ని కర్తవ్యమనటం - ఈ రక్త మాంస కల్పిత శరీరంలోని వ్యామోహానికి ' కర్తవ్యం ' అని పేరిడటం - చాలా సులభం. జనం లౌకికజీవితంలోకి దిగి, ధనం కోసమో, తమకు మోహమున్న మరి దేని కోసమో పెనుగులాడుతూంటారు, కలహిస్తూంటారు. ' ఎందుకీ గందరగోళం? ' అని ఎవరినైనా అడగండి. ' ఇది మా కర్తవ్యం ' అని జవాబిస్తారు. కానీ నిజానికిది విపరీతమైన కాంచన వ్యామోహం, స్వలాభాపేక్ష. ఐనా వాళ్ళు దీన్ని పువ్వులతో కప్పిపుచ్చుతారు. "

" కానీ కర్మయోగులు కావాలనుకునేవారు యీ కర్తవ్యబుద్ధిని

త్రోసిరాజనాలి. మీకూ నాకూ ఏ విధీ లేదు. లోకానికి మీరు యివ్వాలనుకున్న దాన్ని అన్నివిధాలా యివ్వండి; కానీ ' విధి ' గా మాత్రం కాదు! ' లోకానికి దీన్ని నేనిచ్చాను ' అని కలలోకూడా తలంచవద్దు! కర్మాచరణంలో బంధీలుగాకూడదు. మీరెందుకు బందీలు కావాలి? నిర్బంధంచేత ఏ కార్యాన్ని చేసినా అది సంగాన్ని కలిగిస్తుంది. "



▲ " స్వార్థరహిత సత్కర్మాచరణ మూలంగా మోక్షాన్ని పొందడానికి ఏర్పడ్డ నైతిక మత వ్యవస్థే కర్మయోగం. కర్మయోగి అయే వ్యక్తి ఏ సిద్ధాంతాన్నీ విశ్వసించనక్కరలేదు! భగవంతుడి అస్తిత్వాన్ని కూడా అతడు నమ్మనవసరం లేదు. ఆత్మ యిలాటిదని కానీ, పరతత్వ మిలాంటిదనికానీ విచారింప నవసరంలేదు! స్వార్థరాహిత్యాన్ని సాధించటమే అతడి ముఖ్యాశయం; అతడు దాన్ని స్వయంగా సాధించుకోవాలి. అతడి జీవితంలో ప్రతిక్షణం 'అనుభూతి' గానే వుండాలి. ఎందుకంటే, దేన్ని జ్ఞాని తన వివేకం చేతా దివ్యజ్ఞానం చేతా, దానినే ఎలాంటి వాదాలనూ, సిద్ధాంతాలనూ అపేక్షింపక కర్మయోగి తన కార్యాచరణచేతనే సాధించుకోవలసి వుంటుంది. "



# పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ధ్యానుల

## 18

# ఆదర్శ సూత్రాలు

1. **సరియైన రీతిలో ధ్యానం చేయడం; అదే రీతిలో చేయించడం:**

"సరైన ధ్యానరీతి" అంటే "ఆనాపానసతి - విపస్సన" రీతి! అంటే, ఏ మంత్రమూ ఉచ్చరించరాదు; ప్రత్యేకంగా ఏ దేవతా రూపమూ ఊహించరాదు. సుఖాసనంలో కూర్చుని, చేతులు రెండూ కలిపి, కళ్ళు రెండూ మూసుకుని, కేవలం ఉచ్ఛ్వాస నిశ్వాసలనే గమనిస్తూ వుంటే, ఆలోచనలు క్రమక్రమంగా తగ్గుతూ తగ్గుతూ వుంటాయి; మనలో ప్రాణశక్తి క్రమక్రమంగా వృద్ధి అవుతూ వుంటుంది; క్రమక్రమంగా నాడీ మండల శుద్ధి జరిగి, 'దివ్యచక్షువు' ఉత్తేజితమవుతుంది. కనీసం అరగంట పైగా కదలకుండా, కళ్ళు తెరవకుండా కూర్చోవాలి.

2. **సరియైన ఆధ్యాత్మిక పుస్తకాలు చదవడం; అవే పుస్తకాలు చదివించడం:**

దైవత్వాన్ని సూటిగా చెప్పే పుస్తకాలనే ఎంచుకోవాలి; వాటినే చదవాలి. 'హిమాలయ యోగులు,'మిలారెపా జీవిత చరిత్ర', 'ఒక యోగి ఆత్మకథ', 'సంభోగం నుంచి సమాధి', 'తులసీదళం', 'నేను', 'ఆత్మాయణం', 'మరణం లేని మీరు', 'జొనాధన్ లివింగ్స్టన్ సీగల్', 'ధ్యానం శరణం గచ్ఛామి','అవిదిత యదార్థం', 'ప్రవక్త', 'ధ్యానంలో నా అంతర్ యాత్రలు', 'బుద్ధపథం', 'ఆనాపానసతి' - మొదలైన తెలుగులో వున్న పిరమిడ్ పుస్తకాలు తప్పక చదవాలి.

అలానే, ఇంగ్లీషులో వున్న లోబ్‌సాంగ్ రాంపా, రిచార్డ్ బాక్, కార్లోస్ కాస్టానెడా, అన్నీ బీసెంట్, జేన్ రాబర్ట్స్, షెర్లీ మెక్లీన్, రూత్ మాంట్‌గోమరీ, ఖలీల్ గిబ్రాన్, ఇనాయత్ ఖాన్, లెడ్‌బీటర్, ఓషో రజనీష్, మైఖేల్ నైమీ, జేమ్స్ రెడ్‌ఫీల్డ్ మొదలైన మహానుభావుల పుస్తకాలు కూడా తప్పక చదివి తీరాలి: అందరిచేతా ఇలాంటి పుస్తకాలే చదివించాలి.

3. **ధ్యానానుభవాలనూ, పుస్తక జ్ఞానాన్నీ పరస్పరం పంచుకోవడం:**

స్వంత ధ్యానానుభవాలనూ, అధ్యయనం చేసిన పుస్తక అధ్యయనం చేసిన జ్ఞానాన్నీ పరస్పరం పంచుకోవటం వల్ల తక్కువ సమయంలోనే అపార

జ్ఞానాన్ని పొందుతాం! యోగుల, జ్ఞానుల సందేశాలను ఎప్పుడూ ప్రత్యక్షంగా తెలుసుకోవాలి. ఇతరుల అనుభవాలను వినడం ద్వారా మనకు కావలసింది సులభంగా గ్రహించగలుగుతాం. రోజుకు ఒక గంట అయినా ఈ విధమైన సజ్జన సాంగత్యానికి తప్పక కేటాయించాలి.

కర్నూలు, గుంతకల్, ఉరవకొండ, అనంతపురం, ధర్మవరం, తిరుపతి, నాగలదిన్నె, ప్రొద్దుటూరు, నెల్లూరు, పీలేరు, విజయవాడ, నరసరావుపేట, ఎమ్మిగనూరు, హైదరాబాదు, బళ్ళారి, వైజాగ్, నూజివీడు, శ్రీకాళహస్తి, హిందూపురం, కడప, రాయదుర్గం, హోస్పేట్, బెంగుళూరు, మదనపల్లె, గుంటూరు, రాజమండ్రి, శ్రీకాకుళం, నంద్యాల, ఆదోని, కొల్హాపూర్, ఏలూరు- మొదలైన పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ (ఆధ్యాత్మిక సంస్థల) మాస్టర్ల అనుభవాలు వింటూ వుండాలి.

**4. పౌర్ణిమ ధ్యానం చేయడం, చేయించడం :**

పౌర్ణిమ రాత్రుల్లో ధ్యానం ఎప్పుడూ మరువకూడదు; ఆ సమయాల్లో ప్రకృతి అత్యంత ఉల్లాసం గానూ, అత్యంత ఆహ్లాదం గానూ వుంటుంది. పౌర్ణిమ 'ధ్యానం' వల్ల మరింత ఎక్కువ అనుభవాలు వచ్చి మరింత ఎక్కువ శక్తిని మనం పొందవచ్చును. పౌర్ణిమ రోజులు ఇతర లోక మాస్టర్లు ప్రత్యేకంగా భూలోకంలో ధ్యానానికి నిర్దేశించిన రోజులు; అంతేకాక, పౌర్ణిమ రోజుల్లో విశ్వశక్తి భూమి మీద విస్తారంగా ప్రసారమవుతూ వుంటుంది.

**5. పిరమిడ్ శక్తిని ఉపయోగించుకోవడం:**

పిరమిడ్ ధ్యాన కేంద్రాలు సమీపంలో వుంటే, 'పిరమిడ్'లలో ధ్యానం చేయడం ఎంతో లాభకరం! 'పిరమిడ్ శక్తి' ప్రత్యేకంగా మనలోని చైతన్యాన్నీ, శక్తి స్థాయినీ పెంచుతుంది. పిరమిడ్‌లలో సూక్ష్మశరీర యాత్రలు అతి సులభంగా చేయవచ్చు. 'పిరమిడ్ శక్తి' వల్ల అన్ని రోగాలూ వెంటనే నయమవుతాయి.

**6. అల్లోపతీ మందులు ఏమాత్రం వాడకుండా వుండడం; వాటిని సంపూర్ణంగా వ్యతిరేకించడం:**

అల్లోపతీ మందులు వల్ల శరీరం తన సహజ వ్యాధి నిరోధక శక్తిని కోల్పోయి, శక్తిహీనంగా తయారవుతుంది. 'మందులు వాడకపోవడమే' అన్నింటికన్నా మంచి 'మందు'! మన అజ్ఞానం వల్ల శరీరం లోకి మందులు గుప్పిచ్చి, మనం

మన శరీరాన్ని ఇంకా ఇంకా రోగమయం చేసుకుంటూ అనవసరంగా 'మంచాల పాలు' అవుతున్నాం. భౌతిక శరీరం స్వతఃసిద్ధంగానే అద్భుత శక్తి కలిగి వుంది. దీన్ని పూర్తిగా గుర్తించడమే అసలైన 'ఆధ్యాత్మికత' అంటే.

**7. మాంసం తినకపోవడం; దానిని పూర్తిగా వ్యతిరేకించడం:**

శాకాహారం వల్ల తమో, రజో గుణాలు నశించి సాత్త్విక గుణం పెంపొందుతుంది. శారీరక రుగ్మతలన్నింటికీ నిజానికి క్షుద్ర మాంసభక్షణే మూల కారణం. మాంస భక్షకులలో హింసాతత్త్వం ఎప్పుడూ పడగవిప్పి వుంటుంది.

**8. వీలయినంత ఎక్కువగా మౌనం పాటించడం:**

'మౌనం' అంటే 'మాట్లాడక పోవడం'! వీలయినంత 'వాక్ మౌనం' పాటిస్తూ వుంటే, క్రమేపీ అదే మానసిక నిశ్శబ్దానికి సోపానమవుతుంది. మౌనం వల్ల వ్యర్థ ప్రేలాపనలు అంతమయి, మనలోని 'అంతర్వాణి'ని స్పష్టంగా వినగలుగుతాం. మన భావాలను ఎదుటి వారికి క్లుప్తంగా అందించగలుగుతాం. మౌనం ద్వారా ఆదా అయిన అమూల్యమైన కాలాన్నీ, శక్తినీ సద్వినియోగం చేసుకుంటే సకల కళల, సకల విద్యల అభ్యాసం సుసాధ్యమవుతుంది.

**9. పరిమితంగా ఆహారం తీసుకోవడం:**

కడుపుకు సగానికి మాత్రమే ఆహారం తీసుకుని మిగతా భాగాన్ని నీరుకూ, గాలికీ ఎప్పుడూ వదలాలి. తద్వారా శరీరం బరువుగా వుండకుండా తేలికగా వుండి చురుకుగా అన్ని పనులనూ మనం చేసుకోగలుగుతాం.

శరీరపు 'ఆకలి'కి భోజనం అన్నది 'మందు' మాత్రమే. ఆకలి తీరుతూనే భోజనం మానేయాలి!

☆ *రోజుకు మూడు పూటలు తింటే 'రోగి';*
*రోజుకు రెండు పూటలు తింటే 'భోగి';*
*- రోజుకు ఒక పూట తింటే 'యోగి';*

☆ *రకరకాల రుచులు తప్పక రుచి చూద్దాం; అయితే,*
*'రుచి' మాత్రమే జిహ్వకు పెడ్దాం! కడుపుకు తిండి మాత్రం కాదు!*

**10. ప్రత్యేక 'ఆధ్యాత్మిక' వేషధారణ అన్నది లేకపోవడం:**

ప్రత్యేక వేషధారణ అనేది మానసిక ప్రవృత్తులను కొద్దిగా ప్రభావితం చేసినా, అది నిజానికి చాలా తాత్కాలికమే. నిజానికి 'కాషాయ వస్త్రాలు' లాంటి ప్రత్యేక వస్త్రాల వల్ల అహంకారం పెరుగుతుంది. వస్త్రధారణ ఎప్పుడూ సర్వసామాన్యంగానే వుండాలి. కాషాయ వస్త్రాలలో 'ప్రత్యేక పవిత్రత' అన్నది ఏమీ వుండదు.

**11. చిన్నప్పటి నుంచే పిల్లలకు ఆధ్యాత్మిక ప్రశిక్షణ ఇవ్వడం:**

మహాయోగుల జీవిత చరిత్రలను చదివినట్లయితే ఒక విశేషం తప్పనిసరిగా కనబడుతుంది. అదే వారి చిన్నప్పటి నుంచే ప్రారంభమయిన ఆధ్యాత్మిక ప్రశిక్షణ! పిల్లలకు పిన్నవయస్సు నుంచే ఆధ్యాత్మిక శాస్త్రంలో ప్రశిక్షణ ఇవ్వటం అనేది వారి బంగారు భవిష్యత్తుకు రాచబాట అవుతుంది.

పిల్లలు అకలుషితులు. వారి నైజం సర్వదా స్వచ్ఛంగా వుంటుంది. కాబట్టి చెప్పింది తక్షణమే గ్రహించగల్గుతారు. పిల్లలకు ప్రతి 'సిట్టింగ్'లో 15 నిమిషాలు ధ్యానం సరిపోతుంది. వారి అనుభవాలను ఎప్పటికప్పుడు ప్రత్యేక శ్రద్ధతో వింటూ వుంటే వారు ఎంతో ఉత్సాహంగా ఆధ్యాత్మిక రంగంలో ఉరకలేస్తారు.

**12. 'శిష్యరికం' అనేది లేకుండా - అంతా 'మాస్టర్స్' గా విలసిల్లడం:**

సముపార్జించిన ఆత్మజ్ఞానాన్ని ఒకరికొకరు ఎప్పటికప్పుడు పంచుకుంటూ, 'ఎక్కువ-తక్కువ', మరి 'గురు-శిష్య' అనే భేదాలు లేకుండా, అందరూ 'మాస్టర్స్' గానే విలసిల్లడం నేర్చుకోవాలి.

'సీనియర్' - 'జూనియర్' అనే తత్త్వం అలవరచుకుంటూ 'గురు-శిష్య' అనే తత్త్వాన్ని మనలోంచి పూర్తిగా తుడిచివేయాలి.

**13. ఆధ్యాత్మిక శిక్షణలో 'డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాలు' అన్నది ఏమాత్రం లేకపోవడం:**

ఆధ్యాత్మిక ప్రశిక్షణా కార్యక్రమంలో డబ్బుతీసుకోవడం, డబ్బు ఇవ్వడం అనేది పూర్తిగా నిషిద్ధం. ప్రాపంచిక వృత్తుల ద్వారా ఎవరి కాళ్ళ మీద వాళ్ళు నిలబడుతూ, మిగిలిన సమయాలలో ధ్యాన సాధనా, ధ్యాన ప్రశిక్షణా కార్యక్రమాలలో నిమగ్నం కావాలి.

14. విగ్రహారాధన/ వ్యక్తిపూజ/ వ్యర్థమైన కర్మకాండలు మొదలైనవి చెయ్యకపోవడం; వాటిని సంపూర్ణంగా వ్యతిరేకించడం.

మహాయోగులు చేసింది మనం స్వయంగా ఆచరించడం వల్లనే వారి మనం స్థాయికి ఎదుగుతాం. అంతేకానీ వారి విగ్రహాలను పూజించడం, ఆ వ్యక్తులను స్తుతించటం అనేది మన అమూల్యమైన సమయాన్నీ, శక్తినీ 'బూడిద పాలు' చేయడం మాత్రమే అవుతుంది.

అందుకే, ఆర్యసమాజ స్థాపకులైన స్వామి దయానంద సరస్వతి "మూర్తి పూజ మెట్టు కాదు అగడ్త" అన్నారు.

అలాగే, బుద్ధుడు "అప్పో దీపో భవ" అన్నాడు. మహమ్మద్ ప్రవక్త విగ్రహారాధనను పూర్తిగా నిషేధించాడు.

15. ఎవరి సమస్యలను వారే, తమ తమ స్వంత ఆత్మశక్తిని వినియోగించి పరిష్కరించుకోవడం:

సమస్యలు అనేకం వస్తూనే వుంటాయి. అయితే, వాటిని పరిష్కరించటానికి "ఎవరో వస్తారు-ఏదో చేస్తారు"అని ఎదురు చూస్తూ కూర్చోవడమనేది మన తమో గుణాన్ని వ్యక్తపరచుకోవడం తప్ప ఇంకేమీ కాదు. స్వశక్తి ద్వారానే మన సమస్యలను ఎప్పటికప్పుడు మనమే పరిష్కరించుకుంటూ వుంటే, సమస్యలు అనే 'సమస్యే' వుండదు. సమస్యలను ప్రతి ఒక్కరూ తమ తమ 'ప్రత్యేక పరీక్ష సమయాలు'గా గుర్తించి, సదా అప్రమత్తంగా వుండటం అలవర్చుకోవాలి.

అసలు అర్థం చేసుకోవలసిన ముఖ్యసూత్రం ఏమిటంటే, "మన సమస్యలు ఎప్పుడూ మన 'శక్తి-పరిధి' లోనే వుంటాయి; అంతేగానీ, దానిని మించి ఎప్పుడూ వుండవు" అని. 'మరొకళ్ళ సహాయం', 'మరొకళ్ళ అవసరం అనేవి నిజానికి ఎప్పుడూ అవసరం వుండవు.

16. గృహస్థులుగా సంఘంలో వుంటూ, ఎవరి పనులను వారు చూసుకుంటూనే, జీవన్ముక్తిని సాధించటం; వర్తమాన జన్మను ఆఖరి జన్మగా చేసుకోవడం:

"సంసారం దుఃఖసాగరం" అనుకోకుండా "సంసారం ఒక స్వర్గసీమ" అని తెలుసుకుని జీవించాలి; "స్వంత కోరికతో అడుగు పెట్టిన జన్మకారణాన్ని తెలుసుకోడమే" ఆత్మజ్ఞానాన్ని కలిగి వుండడం అంటే.

జితేంద్రియుడుగా వుంటూ, మధ్యేమార్గాంకితుడై, ఆవేశరహిత, హింసారహిత, సత్యస్థిత, సుఖమయ యోగ-సంసారం చేస్తూ, అందరినీ యోగ సంసారోన్ముఖులుగా చేస్తూ వున్న జన్మే ఆఖరి జన్మ.

**17. అన్ని గ్రామాలలోనూ, అన్ని పట్టణాలలోనూ పిరమిడ్ ధ్యాన కేంద్రాలనూ, పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్‌లనూ విధిగా నెలకొల్పడం:**

'శుభ్రత' అనేది మన ఇంటికే పరిమితం అయితే మన చుట్టూ వున్న అపరిశుభ్రత వల్ల పూర్ణ ఫలితాన్ని మనం పొందలేం. అదేవిధంగా, మన వారు, మన చుట్టుప్రక్కల వున్నవారు కూడా జ్ఞానవంతులుగా వున్నప్పుడే మన జ్ఞానం కూడా పూర్తిగా వికసించేది. అందుకే, అన్ని చోట్లా ధ్యాన కేంద్రాలనూ, స్పిరిచ్యువల్ సొసైటీలనూ విధిగా స్థాపించి తీరాలి.

**18. పిరమిడ్ మాస్టర్లందరూ తమ తమ ధ్యానానుభవాలను గ్రంథరూపం చేసి ప్రచురించడం:**

సర్ ఫ్రాన్సిస్ బేకన్ ఈ విధంగా ఉద్బోధించారు- "writing makes a man perfect"అని. అంటే, "వ్రాత అనేది మనిషిని పూర్ణ పరిపక్వత కలిగే వానిలా చేస్తుంది" అని. కనుక, పిరమిడ్ మాస్టర్లందరూ తమ తమ అనుభవాలను విధిగా గ్రంథరూపంగా ప్రచురించాలి; తద్వారా పరిపక్వతను సంతరించుకోవాలి.

ఇదే "ఋషి ఋణం" తీర్చుకోవడం అంటే!



## పుస్తక పఠనం - చదువవలసిన పుస్తకాలు

పుస్తకాలు చదవడం వల్ల మనకు మొత్తం విషయాలన్నీ తెలుస్తాయి. ప్రపంచంలో ఉండే యోగుల జీవిత చరిత్రలను శ్రద్ధగా పఠనం చేస్తే వారి వారి అనుభవాలనూ, వారి వారి బోధనలనూ చక్కగా తెలుసుకోవచ్చును.

మహాయోగుల జీవిత చరిత్రలను చదవడం వల్ల, వారు జీవితాంతం కష్టపడి సాధించిన ఫలితాలను మనం కొన్ని గంటల్లోనే - అన్ని సంవత్సరాలు కష్టపడకుండానే - వారి ఆధ్యాత్మిక సారాంశాల్ని గ్రహించి మన అభివద్ధికి సోపానాలుగా చేసుకోవచ్చును.

గౌతమబుద్ధుడు ఆరు సంవత్సరాలు ధ్యానం చేసి "దుఃఖానికి కారణం తృష్ణ" అనీ, "తృష్ణకి కారణం అవిద్య" అనీ కనుక్కొని ప్రపంచానికి చాటి చెప్పాడు. కానీ, మనం ఆరు సంవత్సరాలు కష్టపడకనే ఒక నిమిషకాలం లోనే దానిని చదివి, "అవిద్యను నాశనం చేస్తే, తృష్ణను వీడితే, ఇక దుఃఖం ఉండదు" అని తెలుసుకోవచ్చును.

పుస్తకపఠనం ద్వారా, ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని సంపూర్ణంగా తెలుసుకుని మనలో ఉన్న మూఢ నమ్మకాల్నీ, మూర్ఖత్వాలనూ వదిలించుకుంటే మన పురోగతికి మనమే దారి ఏర్పరచుకున్నవాళ్ళమవుతాం.

ముఖ్యంగా, మానవుడు 'చనిపోవడం' అనే మాటలను తలచుకోడానికే భయపడతాడు! అసలు 'చనిపోవడం' అనేది, రెండు పగళ్ళ మధ్య నిద్రలాగా, రెండు జీవితాల మధ్య విశ్రాంతి. ఎప్పుడైతే ఈ విషయాన్ని తెలుసుకుంటామో ఇంక మనకు 'చనిపోవడం' అంటే భయం పోయి, అది వచ్చినప్పుడు ఆనందంగా స్వీకరిస్తాం! అప్పుడే మనం స్వయంగా, అంటే 'స్వ ఇచ్ఛ' ఎన్నుకుని తీసుకున్న, వర్తమాన జీవితాన్ని ఆనందమయంగా వుండేలా చూసుకుంటూ మన పురోభివృద్ధి వైపు పయనించ గలుగుతాం.

పైన చెప్పిన విషయాల లాంటివి అనేకం తెలియాలంటే అవి మనకు యోగులు వ్రాసిన పుస్తకాలలోనే దొరుకుతాయి.

అంచేత, తప్పకుండా చదువవలసిన పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ వారిచే ప్రచురింపబడ్డ కొన్ని తెలుగు, ఆంగ్ల పుస్తకాల పట్టికలను ఇక్కడ పొందుపరుస్తున్నాం.

# పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ ప్రచురించిన పుస్తకాలు

| రచయిత | | పుస్తకాలు |
|---|---|---|

## గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటీ

| | | |
|---|---|---|
| 1) కృష్ణ | - | ధ్యానంలో నా అంతర్ యాత్రలు |
| 2) T.మురళీధర్ | - | ధ్యానం శరణం గచ్ఛామి |

## కర్నూలు స్పిరిచ్యువల్ సొసైటీ

| | | |
|---|---|---|
| 1) C. అరుణ | - | నేను; Messages from 40 Masters |
| 2) సుభాష్ పత్రి | - | తులసీదళం |
| | - | బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం |
| | - | Be A Master |
| 3) T. సత్యనారాయణ (సేత్) | - | అవిదిత యదార్థం |
| 4) I.V. రెడ్డి | - | రైకీ |

## ధర్మవరం స్పిరిచ్యువల్ సొసైటీ

| | | |
|---|---|---|
| 1) యాదాలం శర్వాణి (పీటర్ రిఛెలూ) | - | ఆత్మాయణం |
| 2) K.రజనీకాంత్ (ఖలీల్ గిబ్రాన్) | - | ప్రవక్త |

## ది ఎమ్మిగనూరు స్పిరిచ్యువల్ సొసైటీ

| | | |
|---|---|---|
| 1) P.G. రామ్మోహన్(లోబ్‌సాంగ్ రాంపా) | - | మరణం లేని మీరు |

## ది తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ

| | | |
|---|---|---|
| 1) డా॥ B. మహేంద్రవర్మ(రిచార్డ్ బాక్) | - | జొనాథన్ లివింగ్‌స్టన్ సీగల్ |
| 2) I. నరసింహారెడ్డి | - | రాంపా స్పీక్స్ ఎగైన్ |
| 3) తిరుపతి మాస్టర్స్ | - | ధ్యాన వందనం |

## నాగలదిన్నె స్పిరిచ్యువల్ సొసైటీ

| | | |
|---|---|---|
| 1) యండమూరి వీరేంద్రనాథ్ | - | జీవితంలో విజయం |
| 2) సుభాష్ పత్రి (సంకలనం) | - | శ్రీ వసిష్ఠామృతం |

## ధ్యానలహరి పబ్లికేషన్స్

1) సుభాష్ పత్రి - భజగోవిందం
2) సుభాష్ పత్రి - బుద్ధపథం
3) సుభాష్ పత్రి - ఆనాపానసతి

## కాస్మిక్ ఆడియోస్, తిరుపతి

1) సుభాష్ పత్రి - "ధ్యాన వేణువు"
2) సుభాష్ పత్రి - "ఎన్‌లైటెన్‌మెంట్ - అంటే?"
3) సుభాష్ పత్రి - "Bhajagovindam I & II"
4) సుభాష్ పత్రి - "సంభోగం వేరే - సమాధి వేరే"
5) సుభాష్ పత్రి - "పిరమిడ్ పార్టీ"
7) సుభాష్ పత్రి - "ఆత్మవిజ్ఞానం - 1"
8) సుభాష్ పత్రి - "వాక్ క్షేత్రం - 1"
9) సుభాష్ పత్రి - "ఎందరో మహానుభావులు"
10) సుభాష్ పత్రి - "ఆనాపానసతి"

*పై పుస్తకాలకు మరి క్యాసెట్స్‌కు వ్రాయండి*

**D. SIVA PRASAD**

10-13-449, Kotakommala Street,

TIRUPATI - 517 00. Ph. 27418, 24163

## "పిరమిడ్ బుక్ హౌస్"

**A.V. సాయికుమార్ రెడ్డి**

587-E. బాలాజీ కాలనీ, తిరుపతి - 517 001

ఫోన్ : 56178

## ఆంధ్ర ప్రదేశ్, మరి ఇతర రాష్ట్రాలలో పిరమిడ్ ధ్యాన కేంద్రాలు

**సుభాష్ పత్రి**
బుద్ధా పిరమిడ్ ధ్యాన కేంద్రం
రఘునాథ్ థియేటర్ వద్ద,
కల్లూరు, కర్నూలు
ఫోన్ : 29164

**G. వెంకటేష్**
అగ్రికల్చరల్ ఆఫీసర్,
లోబ్‌సాంగ్
రాంపా పిరమిడ్ ధ్యాన కేంద్రం,
ఉరవకొండ, అనంతపురం జిల్లా.
ఫోన్ : 57459

**మిట్టా శ్రీనివాసులు**
ది తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ
నవజ్యోతి పిక్చర్స్,
పెద్దకాపు లే అవుట్,
తిరుపతి. ఫోన్ : 25338

**మిట్టా లక్ష్మీనారాయణ**
ది ధర్మవరం స్పిరిచ్యువల్ సొసైటీ
పబ్లిక్ లైబ్రరీ ఎదురుగా
ధర్మవరం. ఫోన్ : 20150

**T. విజయ్ కుమార్**
పిరమిడ్, ధ్యాన కేంద్రం
దుర్గాభవన్ ఎదురుగా,
సుభాష్ రోడ్డు, అనంతపురం.
ఫోన్ 40389

**T. మురళీధర్**
ది గుంతకల్ స్పిరిచ్యువల్ సొసైటి
11/39-D, సుబ్బప్ప కాంపౌండ్,
రామస్వామి గుడి దగ్గర,
గుంతకల్. ఫోన్ : 27123

**P.V. రెడ్డి నాయుడు**
31-32-95, అడ్వకేట్,
అల్లీపురం,
రాజస్థాన్ హోటల్ ఎదురుగా,
డాబా గార్డెన్స్, విశాఖపట్టణం.
ఫోన్ : 565664

**కంచి రఘురాం**
ప్రెసిడెంట్,
ది తిరుపతి స్పిరిచ్యువల్ సొసైటీ
83, కోలా వీధి, తిరుపతి - 517 501
ఫోన్ : 29283

**P.V. శ్రీనివాసమూర్తి**
మండీ మర్చంట్స్,
వైశ్యా బ్యాంకు ఎదురుగా, హిందూపురం.
ఫోన్ : 21078

**M. ఆనందరావు**
లెక్చరర్, 24-115/2,
శాంతినగర్, నెల్లూరు - 524 004
ఫోన్ : 333619

**K. రవిచంద్ర**
ది రాయదుర్గం స్పిరిచ్యువల్ సొసైటీ
8/2/175, మేడపైన,
తహసీల్దార్ రోడ్డు, రాయదుర్గం
ఫోన్స్ : 62929, 62012

**K.M. ఆనంద మూర్తి**
ప్రెసిడెంట్,
చిత్తూరు, ఫోన్ : 28455

**J. రాఘవరావు**
"పిరమిడ్ హౌస్"
కనకదుర్గా పిరమిడ్ ధ్యాన కేంద్రం
ఆంధ్రాబ్యాంక్ ఎదురుగా, మాచవరం,
విజయవాడ. ఫోన్ : 430334

**డా॥ సూకల చిన్న సత్యనారాయణ**
ప్రెసిడెంట్,
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ, హైదరాబాద్,
6-1-349/1, పద్మారావు నగర్,
హైదరాబాద్. ఫోన్ : 7534061

**Dr. K. న్యూటన్**
12-2-37/170,
శ్రీరామ్‌నగర్ కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాద్.
ఫోన్ : 3534978

**M.P. సుబ్బారాయుడు**
గౌతమ బుద్ధా ధ్యాన కేంద్రం
నాగులకుంట, శ్రీకాళహస్తి.

**K.P. వీరన్న శెట్టి**
ది ఎమ్మిగనూరు స్పిరిచ్యువల్ సొసైటీ,
డోర్ నెం. 1/67,
కాలనీ, మూడవ లేన్,
K.P.S.S. నివాస్,
ఎమ్మిగనూరు.
కర్నూలు జిల్లా.
ఫోన్స్ : 55262, 55108, 55442

**M. భీమసేన రావు**
విద్యారణ్య స్పిరిచ్యువల్ సొసైటీ
B.D.O. ఆఫీస్ వెనుక, హోస్పేట్,
కర్ణాటక, ఫోన్ : 56448

**B. యోగానంద**
శ్రీ కృష్ణా పిరమిడ్ ధ్యాన కేంద్రం
బలిజపల్లి, వయా సదుం,
చిత్తూరు జిల్లా.

**B. ముఖర్జీ**
ది విజయవాడ స్పిరిచ్యువల్ సొసైటీ
ఓం ఆర్ట్ ప్రింట్, బీసెంట్ రోడ్,
J.D. హాస్పిటల్ రోడ్,
విజయవాడ.
ఫోన్ : 577684

**P. రామకృష్ణ**
అడ్వకేట్,
స్టేషన్ తోట,
నూజివీడు.
ఫోన్స్ : 33014, 842242

A. పూర్ణచంద్రరావు
రవి మెడికల్స్, బుచ్చిరెడ్డి పాలెం,
నెల్లూరు జిల్లా. ఫోన్స్ : 7318, 73218

శ్రేయన్స్ డాగా
బేతుల్ ఆయిల్ ప్రై. లి.
బేతుల్, మధ్యప్రదేశ్
ఫోన్స్ : (O) 30971, 30382
(R) 30051, 22551
ముంబాయి : 09820 182607

B. వెంకటేశ్వరరావు
6-2-53/B,
జమ్మిబండ,
ఖమ్మం.
ఫోన్ : 27309

శైలేంద్ర జైన్
21, సౌత్ అవెన్యూ
చే బే కాలనీ,
రాయపూర్-1
ఫోన్స్ : 536382, 535970

T.G. పాండురంగయ్య శెట్టి
చీఫ్ పాట్రన్
ఆదోని స్పిరిచ్యువల్ సొసైటీ
17/4 బాగ్యలక్ష్మి,
వెజిటెబుల్ ఆయిల్ ప్రొడక్ట్స్,
బసవపురం రోడ్డు, ఆదోని - 518 301.
ఫోన్స్ : 52606, 52770,
51303, 51304

G.N. గుప్త
P.S.N. డిష్ అడ్వర్టైజింగ్ ఎదురుగా
T.B. రోడ్డు, ఆళ్లగడ్డ - 518 453
ఫోన్ : 20585

ఎర్రిస్వామి
2049, దేవరాజ నగర్,
దొడ్డబళ్ళాపూర్ పోస్ట్, కర్నాటక - 561 203.
ఫోన్ : 923265

Y. దశరథ గుప్త
చీఫ్ పాట్రన్,
ది మహబూబ్ నగర్,
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీ
పోలీస్ క్వార్టర్స్ ఎదురుగా, మహబూబ్ నగర్.
ఫోన్స్ : 42275, 42895

జి. ప్రకాష్ రావు
19-4-57,
ప్రకాష్‌రావు నాయుడు వీధి,
గవరపాలెం, అనకాపల్లి - 531 002.
ఫోన్స్ : 24986 (O) 22176 (R)

K.L.N. రావు
7/599-1, జయనగర్ కాలనీ
కడప - 516 002.
ఫోన్: 46712, ఫాక్స్ : 40774

M. ఈశ్వర రావు
L.I.C. 88, A.P.H.B. కాలనీ,
ఏలూరు - 534 002.
ఫోన్ : 33527

**G. రాజకుమారి**
W/o. సాంబశివరావు
11/106, వర వీధి, ఏలూరు రోడ్డు,
గుడివాడ - 521 301.
ఫోన్ : 44916

**Dr. V. సత్యనారాయణ మూర్తి**
శ్రీ వెంకట సత్యసాయి హాస్పిటల్
కృష్ణానగర్, జగిత్యాల - 503 327.
ఫోన్స్ : 24130 (O) 23790

**అడప కోటేశ్వరరావు**
సాయి ఎలక్ట్రానిక్స్
జిన్నా టవర్, రెవెన్యూ కాంప్లెక్స్
గుంటూరు - 522 001.

**Dr. M.P. మునిరెడ్డి**
ఆయుర్వేద డాక్టర్
తాడిపత్రి రోడ్డు,
జమ్మలమడుగు - 516 434.
ఫోన్ : 70193

**V.V. చంద్రశేఖర్**
C/o. B.V. రామకృష్ణారావు
7-158-25, శ్రీ నిలయం
రవిపాడు రోడ్డు, కాకతీయ నగర్,
నర్సారావుపేట - 522 601
ఫోన్ : 23962

**B. శ్రీరాములు**
మెయిన్ బజార్, న్యామద్దాల,
C.K. పల్లి మండలం - 515 101.
అనంతపురం జిల్లా.

**K. ఆర్ముగం**
374, 100 అడుగుల రోడ్,
తాటాబాద్, కోయంబత్తూర్ - 641 012
ఫోన్స్ : 496399, 496299
e.mail: cdc@mdz.vsnl.net.in

**G. విజయ కుమార్**
C/o. గండికోట,
రామయ్యశెట్టి, సెక్రటరీ,
పలమనేరు స్పిరిచ్యువల్ సొసైటీ
బజారు వీధి,
పలమనేరు - 517 408
ఫోన్ : 52245

**N. ప్రసాదరావు**
C/o. NIT-CITE కంప్యూటర్స్
మేనేజింగ్ డైరెక్టర్, రెళ్లవీధి,
శ్రీకాకుళం పోస్టు - 532 001. ఫోన్ : 52245

**Ch. తిలక్**
పాలశీతల కేంద్రం
వీరంకిలాకు, కృష్ణాజిల్లా. ఫోన్ : 82234

**P.N. చంద్రశేఖర్**
205, జ్ఞానమార్గ, సిద్దార్థ లే అవుట్,
మైసూర్ - 507 011. ఫోన్ : 570772

**D. సుధాకర్ రెడ్డి**
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
పత్తికొండ పోస్ట్ - 518 380.
కర్నూలు జిల్లా, ఆం.ప్ర. ఫోన్ : 76291

**M. మల్లికార్జున**
IInd Cross, Ist Main
Ist లింక్ రోడ్, బసవేశ్వర నగర్,
బళ్ళారి, కర్నాటక.
ఫోన్స్: 55208 (R) 50072 (O)

**M.S.R. రాంప్రసాద్**
మెయిన్ బజార్,
ఎల్లనూరు - 515 465.
అనంతపురం జిల్లా
ఫోన్స్ : 79108 (O), 79137 (R)

**D. శివ ప్రసాద్**
ధ్యానలహరి, చీఫ్ కరస్పాండెంట్
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్, ఇండియా
525, రెడ్డి & రెడ్డి కాలనీ,
తిరుపతి ఫోన్స్ : 27418, 24163

**శ్రేయన్స్ డాగా**
810, మాకర్ ఛాంబర్ - V,
నారీమన్ పాయింట్,
ముంబాయి - 400 021,
ఫోన్ : 2828936/37,
Fax : 2828935
cell : 98201 82607

**R. శాంత కుమారి**
సెక్రటరీ,
3/61, L.B.S. రోడ్డు,
పీలేరు - 517 214.
ఫోన్ : 44543

**శివ ప్రసాద్**
ది తాడిపత్రి స్పిరిచ్యువల్ సొసైటీ
1/538, APSRTC
బస్టాండు ఎదురుగా, తాడిపత్రి
అనంతపురం జిల్లా.
ఫోన్స్: 73234, 74353, 73847

**V.S. రమేష్ బాబు**
Asst. మేనేజర్,
B-16, నవ నగర్,
పాల్వంచ - 507 115.
ఖమ్మంజిల్లా.

**హరనాథ్**
కృష్ణా పిరమిడ్ ధ్యాన కేంద్రం
25/657, శ్రీనివాస నగర్,
వాటర్ ట్యాంకు ఎదురుగా
నంద్యాల - 518 501. కర్నూలు జిల్లా.
ఫోన్ : 43640

**S.K.రాజన్** A.G.M.
నేషనల్ బ్యాంక్ ఆఫ్ అగ్రికల్చరల్
& రూరల్ డెవలప్‌మెంట్
42-A, కొంగునగర్, Ist Street,
ఈరోడ్ - 638 004. తమిళనాడు.

**B. రామ జోగేశ్వరరావు**
మాస్టర్ శివ పిరమిడ్ ధ్యాన కేంద్రం
54-19-23, L.I.C.కాలనీ,
విద్యానగర్ కాలనీ,
మండేలా పార్కు రోడ్,
విజయవాడ. ఫోన్ : 470418

**M.V.S. నరసింహారావు**
170/1, IInd బ్లాక్
జయానగర్, 7th క్రాస్, 7th మెయిన్,
బెంగుళూరు.
ఫోన్ : 6563976

**B.V. ప్రతాప్ రెడ్డి**
S.P. సూపర్ స్టోర్స్
పోలీస్ వెల్‌ఫేర్ కాంప్లెక్స్, అనంతపురం.
ఫోన్ : 41279,
Cell : 98480 79279

**M. రెడ్డి సుధాకర్**
6/74, బజార్ వీధి,
వాయల్‌పాడు,
చిత్తూరుజిల్లా
ఫోన్ : 72389

**S. రఘునాధరావు**
74-8-15, ప్రకాష్ నగర్,
రాజమండ్రి. ఫోన్ : 468098

**G. రామ సుబ్బారెడ్డి**
7/518, N.G.O. కాలనీ,
కడప. ఫోన్ : 52060

**Dr. G.R. యుగంధర్**
హీరా హాస్పిటల్స్,
గోదావరి ఖని.
కరీంనగర్ జిల్లా.
ఫోన్స్ : 45506, 67284

**M. శివ ప్రసాద్**
F.No.176,
శ్రీ శ్రీనివాస అపార్ట్‌మెంట్స్
వాసవీ నగర్ (Old)
కార్ఖానా, సికింద్రాబాద్ -15.
ఫోన్స్ : 7747578, 7747586

**J. స్వర్ణలత**
VIII - 219,
నెహ్రూ బజార్,
పంచరత్న బిల్డింగ్స్,
మదనపల్లి. ఫోన్ : 62010

**ఫాలినీ బాలాజీ**
101, సూర్యా ఎన్‌క్లేవ్,
తిరుమలగిరి, సికింద్రాబాద్-15.
ఫోన్ : 7794031

**T. మురళీధర్**
2/73, అల్వాల్, సికింద్రాబాద్.
ఫోన్ : 7861172

**K.V. రాం ప్రసాద్**
జనతా ఆప్టికల్స్
కాటూరు రోడ్డు, ఉయ్యూరు.
కృష్ణాజిల్లా.
ఫోన్ : 32569